శ్రీమదాంధ్ర

# తులసీరామాయణము





రచయిత :

శ్రీ స్వామి అవ్యయానంద.

## సోదరా!

వెఱ్ఱివానివలె చూడకు.
వెనుకంజ వేయకు,
ఆశ్రిత కల్పవృక్ష మిది.
అప్రతిమానము.
ఆనందదాయకము.

## సోదరీ!

ఇది నాకెందు కనకు.
ఇదియే నీజీవితమునకు రక్ష.
ఇదియే నీసౌభాగ్యమును.
పెంపొందించును.
నమ్మినవారి కనంత ఫలదాయకము

ఓమ్

అవ్యయానంద గ్రంథమాలా — షష్ఠ రత్నము

# శ్రీమదాంధ్రతులసీరామాయణము

## (తృతీయ - చతుర్థ సోపానములు)








శ్రీ స్వామీ అవ్యయానంద

విరచితము.

వెల: 4/-





# ✽ కృతి సమర్పణము ✽

క. కృతి నొసఁగితి దీనిన్ మ
త్పతికిన్ శ్రీపతికి భక్తపాలన రతికిన్
క్షితి కన్యాతత మానస
హృత రమ్యాకృతికి హరి కహీనద్యుతికిన్

తే. ఇది సమర్పించితి మదీయహృదయమగుట
నవనిజాపతి కఖిలాంతరాత్మునకును
రామచంద్రునకున్ విశ్వరక్షకునకు
నాకు మత్పతి కవ్యయానందునకును

క. దీనిని నిత్యముఁ జదివెడి
మానినులుం బురుషు లనుపమాన సుఖములం
గాంచంగల రిహపరముల
శ్రీనాథునికరుణ సకలసిద్ధిద మగుటన్.



అవ్యయానంద.



డాక్టర్. పోకల రఘుపతిరావు
నాయుడుగారు (మద్రాసు)
వీరు రు 200 లు ముద్రణార్థము సహాయ
మొనర్చిన వదాన్యులు.



శ్రీ రాపేటి అప్పలనాయుడుగారు
(కస్పాజగన్నాథపురం)
వీరు రు 100 లు ముద్రణార్థము సహాయ
మొసగిన వదాన్యులు

శ్రీః

# తొలిపలుకు

రామాయణము హిందువులకు పూజ్యగ్రంథము. శ్రీరామచంద్రుడు ఆదర్శపురుషుడు. సంస్కృతభాషలో వాల్మీకిరామాయణమునకునూ, తమిళమున కంబరామాయణమునకునూ గల గౌరవప్రతిష్ఠలు హిందీభాషలో తులసీరామాయణమునకు గలవనుట నిర్వివాదాంశము. శ్రీరామప్రభువుయొక్క దివ్యదర్శనభాగ్యమునంది నిరంతర తారకమంత్రోపాసనము చేసిన భక్తిమార్గనిష్ఠాతుండగు తులసీదాసు "రామచరిత మానసము"నకు గ్రంథకర్తయగుట శ్లాఘనీయము. రాజహంస సరోవరమునందుండు చందంబున ఈ రామాయణము మహేశ్వరుని హృదయ సరోవరమున ఉండుటచేత దీనినామము రామచరిత మానసమునాబరంగె, శ్రీరామతత్త్వమును కూలంకషముగా నిరూపించిన తులసీదాసు ధన్యుడు.

"ఆనందకాననేభాతి – తులసీజంగమస్తరుః
కవితామంజరీయస్య – రామభ్రమరశోభితా"

భక్తావతంసుండగు తులసీదాసు తన రామాయణమున కోదండరాముని సాక్షాత్పరమాత్మ స్వరూపుడుగా వర్ణించెను. శ్రోతల హృదయములలో కరుడుగట్టిన యజ్ఞానమును పారదోలునట్టి ప్రగాఢభక్తి నోతప్రోతముగా నింపెను. పైగా శ్రీరామచంద్రుని సామాన్య మానవునిగా దలంచిన మహాపాతకము గల్గునని గూడ వర్ణించెను. రామాయణమునందలి ఒక్క అక్షరమును చదివినను, చదివించినను, వినినను వినిపించినను మహత్తరపుణ్యము గలుగునని గూడ తులసీదాసు భక్తుల కుత్తేజమును కల్గించెను. రామచరిత మానస పారాయణ మాత్రమున సమస్త శుభ

ములు చేకూరును. అశుభంబులు దరికిరావు. ఖద్యోతుని సన్నిధి నున్న వారికి చీకటి యుండనట్లు శ్రీరామ ధ్యానముచేయువారికి అజ్ఞానముగాని, దుఃఖములుగాని, వ్యథలుగాని యుండవు.

హిందీభాషలోనుండు రామాయణము నందరును పఠించలేరు. భాగవతోత్తములును, సదాచార సంపన్నులును, నిరాడంబర జీవులగు పూజ్యశ్రీ అవ్యయానందకవీశ్వరులు ధన్యులు. శ్రీవారు పద్యరూపముగా రచించిన శ్రీమదాంధ్రతులసీరామాయణము మూలమునకు సరియైన అనువాదమనుట యతిశయోక్తిగాదు. సుబోధకముగాను, మధురమంజులముగాను, ఆనందోత్సాహముగాను రచింపబడిన ఈ రామాయణమును చదువు మహద్భాగ్యము కల్గి దీనికి తొలిపలుకు వ్రాయుటచేత నేను ధన్యుడనైతి ననుకొనుచున్నాను. ప్రతీవారింట నుండవలసిన గ్రంథరాజ మిదియని నా యభిమతము. ఆంధ్రావని కట్టి మహత్తరసేవ చేసి రామతత్త్వమును సులభశైలిలో ప్రజానీకమున కందజేసిన అనువాదకులు శ్రీరామచంద్రుని కృపాపాత్రులై తరించెదరు గాత! ఇట్టి భాషా సేవ చేసిన గ్రంథానువాదకులకు నేననేక కృతజ్ఞతాపూర్వక వందనములం జేయుచున్నాను.

దేవాలయం వీధి,
కాకినాడ,
(తూర్పు గోదావరి)

ఇట్లు, బుధజన విధేయుడు,
'అభినవ తులసీదాస'
పసుమర్తి శ్రీరామమూర్తి, బి. ఏ.

# పండితాభిప్రాయములు

**ఆర్షవిద్యాభూషణ,**

**శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు,**

కాకినాడ.

**14—3—65**

శ్రీ స్వామి అవ్యయానందులవారి తులసీరామాయణాంధ్ర పద్యానువాదమును వారు వినిపింపగ కర్ణరసాయనముగా వింటిని. ఇట్టి పవిత్ర గ్రంథము ననువదించుటకు ప్రేరకముగా నుండదగిన భక్తితత్త్వము గల్గిన వారగుటచే వీరి రచనయందు తన్మయత్వము పారమార్థిక లక్ష్యము పుష్కలముగా గోచరించుచున్నవి. పద్యములు సరళములై ధారాశుద్ధి గలవై, మధురపదగుంఫితములై చేతము నలరించుచున్నవి. విన్నకొలదియు విననలయు ననిపించుచున్నవి. ఒక జగత్ప్రసిద్ధ గ్రంథము నీరీతిగా మనల కందించుచున్న యీ మహనీయులు అభినందనీయులే కాక అభివందనీయులు కూడనని నా యభిప్రాయము.

**శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు,**
**తెలుఁగు జాతీయ బహుమానగృహీత,**
**రిటైర్డు ఏ. ఇ. ఎస్.**
కాకినాడ.
**16—3—65.**

శ్రీమద్రామాయణము భారతదేశమున కెన్నఁడు చెడని అమృత భాండము. వాల్మీకి దీనిని మన జాతికిచ్చి నేఁటివఱకే యితర సజాతీయుఁడు చేయలేని శాశ్వతమైన మహోపకారము చేసినాఁడు. రామాయణము గల జాతిలోఁబుట్టుకయే ధన్యమైనది. తులసీదాసు శ్రీరామామృతమును హిందీభాషలో వియద్గంగాస్రవంతివలె దేశమంతటఁ బ్రవహింపఁ జేసినాఁడు గాంధీమహాత్ముఁడు తులసీరామాయణము తనకు రామరామము నిచ్చి రక్షించినదని ప్రశంసించెను.

సంస్కృత వాల్మీకమున కనువాదములు తెలుఁగులో ననేకములు గద్య పద్య కావ్యములుగా రచింపబడి యున్నటులే తులసీరామాయణము నకును గలవు. భగవంతుని చరిత్రమున కతివ్యాప్తి దోషమెన్నఁడు నుండదు. రాముని మహిమ అట్టిది. రామనామ మహిమ అమోఘము. అందుచే నెందరో రామచరితమును వ్రాసిరి. వ్రాయుచున్నారు; వ్రాయుదురు. ఇదియే దేశమును సర్వవిధక్షోభములనుండి కాపాడఁగల దివ్యశక్తి.

శ్రీపతి జగన్నాథశర్మగారు మాడుగుల వాస్తవ్యులు; కొలఁది కాలమునుండి కాకినాడలో నుండి సత్కాలక్షేపము చేయుచున్నారు. నిరాడంబరులు. ప్రతిఫలాపేక్ష లేని నిష్కామభక్తులు. చిన్ననాటినుండియుఁ దమ తండ్రిగారియొద్ద విద్యాకవితావ్యాసంగముచేసి, తులసీరామాయణము నాంధ్రకావ్యముగా రచించి ధన్యులైరి. వీరు పవిత్రజీవనులై రామ చరిత్రను రచించుటచేఁ దమ లేఖినిని, తమ జన్మమును ధన్యమొనర్చి కొనిన పూతాత్ములు.

వీరి కవిత అనన్య సారళ్య మాధుర్యములు గలిగి ప్రసన్నశైలితోఁ బూర్వాంధ్ర రామాయణ కవుల వాసికే మాత్రమును దీసిపోవనిదై వెలయుచున్నది. వీరి రామాయణ కావ్యము రచించి ఉత్తమాంధ్ర కవుల సరస నొక స్థిరస్థానము నార్జించుకొనిరి. వీరి కృషి సర్వజనాదరణ పాత్రమైనది. వీరితోఁధిక సారస్వతసేవ చేయుటకు దీర్ఘాయురారోగ్యభాగ్యము లిచ్చి భగవంతుఁడైన శ్రీరామచంద్ర ప్రభు వనుగ్రహించుగాక.

# శ్రీ గాయత్రీ పీఠమ్

డా. హైమ సత్యమ్

జగద్గురు శ్రీమదాది శంకరభగవత్పూజ్య పాదప్రతిష్ఠాపిత దక్షిణామ్నాయ సంజ్ఞిక శ్రీశృంగగిరి పీఠాధిష్ఠిత శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర భారతీ పూజ్యపాదైః తత్కర కమలసంజాత శ్రీశ్రీశ్రీ మదభినవ విద్యాతీర్థ పూజ్యపాదైశ్చ సదయాభ్యనుజ్ఞాత శ్రీగాయత్రీ పీఠాధిపత్యే విరాజమానైః, తైరేవపూజ్యపాదైరనుగ్రహీత తురీయాశ్రమ యోగిపట్టైః పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ విద్యాశంకర భారతీస్వామిభిః.

శ్రీ 'అవ్యయానంద' పతి జగన్నాధకవి విరచిత ఆంధ్ర తులసీ రామాయణవిషయే కవీనాం శ్రేయోభివృద్ధయే నారాయణ స్మరణ పూర్వకం విరచితాఽశిషః సముల్లసంతుతరామ్.

శ్రీ గాయిత్రీ పీఠాధిపతులగు శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామివారి ఆశీ॥ పూర్వక ప్రశంస.

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి జాతేదశరథాత్మజే॥
వేదఃప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥

అనుప్రమాణమునుబట్టి వేదవేద్యుడే రామచంద్రుడుగా అవతరించగా వేదము రామాయణముగా రూపొందినది అని విశదమగుచున్నది. రాముడు అనగా ధర్మమే మూర్తీభవించిన వ్యక్తి. అట్టి రామచంద్రుని చరిత్రను వాల్మీకిమహర్షి రామాయణముగా రచించి ధన్యుడైనాడు, తరువాత తులసీదాసు రామచరిత్రను హిందీలో అద్భుతమైన భక్తి భావములతో మృదుమధుర శైలిలో రచించి అఖండమైన యశస్సును గాంచినాడు. ఉత్తర హిందూస్థానములో తులసీరామాయణము లేని ఇల్లు లేదనిన అతిశయోక్తి కానేరదు. అట్టి అద్భుతమైన తులసీరామాయణము హిందీభాషలో నున్నందున హిందీభాష తెలియని అంధ్రులకు ఆ రామాయణములోని విలక్షణమైన భక్తి భావములు తెలిసి అనందించుటకు వీలు

లేకున్నది. శ్రీ స్వామి అవ్యయానంద – పతి జగన్నాథకవిగారు ఆ తులసీ రామాయణమును ఆంధ్రభాషలో మృదుమధురశైలితో అందరికి తెలియులాగున పద్య కావ్యముగా రచించి ఆలోటును తీర్చినారు. తులసీ రామాయణములోని అద్భుతమైన భక్తి భావములు చరిత్రలోని విశేషములు అన్నియు ఈ గ్రంథములో చక్కగ విశదీకరింపబడినవి. ఆంధ్ర సాహిత్య ప్రపంచమున ఈ గ్రంథము ఉన్నత స్థానమును అలంకరించ గలదని విశ్వసించుచున్నాను. ఇట్టి అమూల్యసేవను గావించిన కవిగారికి సకల శ్రేయస్సులు కలుగుగాక అని మా నారాయణ స్మరణపూర్వక ఆశీస్సులు.

(శ్రీ)

---

"శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
కవిరాజ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస,
అభినవ శ్రీనాథ, వేదవిద్యా విశారద"
శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు,
రాజమహేంద్రవరము.
26—2—1946

బ్రహ్మశ్రీ అవ్యయానంద పతిజగన్నాథకవిగారు "తులసీరామాయణము" తెనుగున బద్యకావ్యముగా రచించియున్నారు. నాయొద్ద నాగ్రంథము చాల భాగము చదివి వినిపించినారు. పూర్వకవుల పోకడలు గలిగి కవనమమృత రసప్రవాహమువలె నున్నది.

శ్రీ చేంబోలు వేంకటయోగిగారు,
అనకాపల్లి.
20 డిశంబరు 1963

హరిః ఓం

అద్వైత పరబ్రహ్మమునకు జగత్కారణ భూతత్వమేల కల్గెనను ప్రశ్న కాత్మవిదులు బహుధాసమాధాన మిచ్చిరి. అయినను ఈ రహస్యము స్ఫుటబోధము గాకున్నది. ఈ సందేహమును భక్తకోటుల నుండి వైదొలగ జేయుటకు మున్ను ప్రయత్నములు జరుగకపోలేదు. ఆదికవి కృతి కనుసారిగా నధ్యాత్మరామాయణము వ్రాయబడియుంట యిందులకే. "రామో నగచ్ఛతి నతిష్ఠతి......నైవకరోతి కించిత్......తస్యసన్నిధి మాత్రేణ సృజామీదమతంద్రితా" అను సీతాముఖ కమలోద్భూత వాగ్రసాయనమును సిద్ధాంతరూపేణ ప్రతిపాదించి మిగిలిన గ్రంథమున నద్దానిని ధ్రువీకరించె నా యధ్యాత్మరామాయణ కారుడు. ఆయుద్గ్రంథమునకు స్వేచ్ఛానువాదమోయన నలరారెడు గోస్వామి తులసీదాస్ మహాశయుని "రామచరితమానస్" హిందీభాష ప్రాచీన రూపమైన "అవధీ" భాషయందున్నది. ఈయనగూడ "ఏక అనీహ అరూప అనామా అజసచ్చిదానంద పరధామా, వ్యాపక విశ్వరూప భగవానా, తెహిధరి దేహ చరితకృతనానా...సో కేవలభగతనహితవాగీ, పరమకృపాలు ప్రణత అనురాగీ" అను సిద్ధాంతమును వాక్రుచ్చి దాని నుపపాదించుటకు "ఏక రామ అవధేశకుమారా...యుహసాయిరామకి అపరకోవు" అను ప్రశ్నను జగజ్జనని పార్వతినోట నడిగించి భవునిచేత నేతద్గ్రంథరూపకమగు సమాధాన మిప్పించెను. అట్టులనే యీకథా కథాక్రమమున భారద్వాజయాజ్ఞవల్క్య సంవాదము, కాకభుశుండీ గరుడ సంవాదము ననుమిషచే తిరిగితిరిగి ఈ ప్రశ్నయే వేయించి దానికి సమాధానము ప్రత్యక్షముగను అప్రత్యక్షముగను గూడ నిప్పించెను. ఈశ్వరావతార హేతువుల గూర్చి యీ మునీషి "రామజన్మకై హేతు అనేకా పరమవిచిత్ర ఏక తేయేకా" అని వాక్రోన్నాడు. జయవిజయుల శాపము, నారద శాపము శతరూపాతపము జలంధర సతిశాపము మున్నగు కారణములను పేర్కొని యీ కథానికల

ద్వారా రమ్యాతిశయమ్ముగ నిర్గుణ బ్రహ్మమునకు సగుణరూపము కలుగుటకునుగల కారణములను చెప్పకచెప్పెను. ఇంకను సందేహ విమోచనము కాదేమోనను శంక చేకాబోలును "సోతెహి తాహి తోహి నహి భేదా... వారిబీచి ఇవగావ ఇవేదా" అని "జీవో బ్రహ్మైవ కేవలః" అను మహా వాక్యమును తుది నిర్ణయముగ లోమశునిచే పలికించినాడు.

ఇట్టి యుద్గ్రంథమునకు లక్ష్యార్థ వ్యంగ్యార్థ గూఢార్థములు చెడకుండ మఱియొక భాషలోనికి సంతరించుట తిరిగి యపరోక్షానుభూతి పొందిన తులసీదాస్ గారికి మాత్రమే శక్యము. ఏతన్మాత్రున కవగతమగు విషయమాయిది! ఆత్మ విశ్వాసముతో లోకసంగ్రహేచ్ఛచే నట్టి మహాత్కార్యమునకు పూనుకొని విఘ్న పరంపరలచే త్రాసము జెందక ప్రోత్సాహాభావమును సరకుగొనక రామచరిత మానసమునకు యథార్థమగు నాంధ్రానువాదము నాంధ్రలోకపు కల్పతరువన వెలయించిన శ్రీ అవ్యయానందస్వామిగారెంతయు ధన్యులు. యావదాంధ్రలోకము వీరికి కృతజ్ఞత తెలుప వలసియున్నది.

తెలుగు భాషయందును "అవధీ" భాషయందును తుల్యాధికార సంపన్నులగు వీరు మూలగ్రంథములోని భావగరిమ చెడకుండ కొండొక పట్టుల మూలమునకే వన్నె తెచ్చుమాదిరిగ తెనిగించిరి. నేటిసరికి ఇట్టి సర్వాంగ సుందరమగు ప్రయత్న మీ విషయమున గానరాదు. వీరి శ్రీముఖతః భాషాంతరీకృత గ్రంథమును విను సౌభాగ్యము నాకబ్బినది. వీరి గ్రంథము మూలమున కనువాదమై తదంతర్గతోపనిషదర్థములకు వ్యాఖ్యానమై గ్రంథమెల్లెడల నోతప్రోతమైయుండి ధర్మసూక్ష్మములకు భాష్యమై యొప్పుచున్నది.

దీనిని శ్రద్ధగ పఠించినవారికి తప్పక జడచేతనగ్రంధి విమోచనము గలుగును. ఆంధ్రముముక్షువులు దీనిని యథార్థముగ గౌరవించి ఆత్మోపకారమును గ్రంథకర్తకు ప్రత్యుపకారమును చేయుదురుగాక!

---

# ఈకావ్య ముద్రణార్థము ధన సహాయ మొనర్చిన వదాన్యులు.

| | | | రూ. |
|---|---|---|---|
| 1. | డాక్టరు, పోకల రఘుపతిరావునాయుడుగారు | (మద్రాసు) | 200-00 |
| 2. | శ్రీ రాపేటి అప్పలనాయుడుగారు | (కస్పాజగన్నాథపురం) | 102-00 |
| 3. | ,, పాలకుర్తి ఆదినారాయణగారు | ,, | 50-00 |
| 4. | ,, బొమ్మన రామకృష్ణగారు | (కొండపేట) | 30-00 |
| 5. | ,, పోలమరశెట్టి రామునాయ్డుగారు | (కస్పాజగన్నాథపురం) | 20-00 |
| 6. | శ్రీమతి బుద్ధా కృష్ణమ్మగారు | ,, | 20-00 |
| 7. | శ్రీ పిళ్ళా పరదేశినాయుడుగారు | ,, | 13-00 |
| 8. | ,, ఆడారి సూరి కు॥ కొండయ్యగారు | ,, | 10-00 |
| 9. | ,, ఆడారి చిట్టిపైడితల్లిగారు | ,, | 10-00 |
| 10. | ,, ఆడారి అప్పారావుగారు | ,, | 10-00 |
| 11. | ,, పుట్టా కోటిపల్లిగారు | ,, | 10-00 |
| 12. | ,, పీలా బుచ్చెన్నగారు | ,, | 10-00 |
| 13. | ,, దొడ్డి గంగునాయుడుగారు | ,, | 10-00 |
| 14. | ,, శ్రీత్యహాడీ నూకరాజుగారు | (తుని) | 10-00 |
| 15. | ,, కొల్లూరు గంగరాజుగారు | (నెల్లిమర్ల) | 10-00 |
| 16. | ,, కొల్లూరు శ్రీరాములుగారు | ,, | 10-00 |
| 17. | ,, T. S. రామారావుగారు, ఎలక్ట్రికల్ ఇంజనీర్ | ,, | 10-00 |
| 18. | ,, నెల్లిమర్ల సీతారాంగారు | ,, | 10-00 |

| | | | |
|---|---|---|---|
| | | | రూ. |
| 19. | ,, నున్న క్రిష్ణయ్యగారు | (నక్కపల్లి) | 5-00 |
| 20. | శ్రీమతి పాలకుర్తి నారాయణమ్మగారు | (కస్పాజగన్నాథపురం) | 5-00 |
| 21. | శ్రీ బీశెట్టి జగ్గునాయుడుగారు | ,, | 5-00 |
| 22. | ,, బీశెట్టి కృష్ణారావుగారు | ,, | 5-00 |
| 23. | ,, రాపేటి అప్పలస్వామి కు॥ అప్పలనాయుడుగారు | ,, | 5-00 |
| 24. | ,, పాలకుర్తి రమణగారు | ,, | 5-00 |
| 25. | ,, అవ్వా రాముగారు | (నెల్లిమర్ల) | 5-00 |
| 26. | ,, మమ్ముల వెంకటనారాయణగారు | ,, | 5-00 |
| 27. | ,, తూతిక నాగయ్యగారు | ,, | 5-00 |

రూ 5-00 ల లోపు యిచ్చినవారు చాలమంది కలరు. వీరినెల్లరను శ్రీరామచంద్రమూర్తి యథోచిత ఫలప్రదాతయై కాపాడుగాక!

---

# విజ్ఞప్తి



సోదర సోదరీమణులారా!

శ్రీ తులసీరామాయణము కలియుగ ప్రజలపాలిటి కల్పవృక్షము. ఈ గ్రంథరత్నముపేరు విన్నంతనే యథార్థముగా మానవత్వము కలవారికి శరీరములు పులకరించును. కన్నులనుండి ఆనందాశ్రువులు వెడలును. భక్తి పరవశులై హస్తములు ముకుళించి శిరమునఁ జేర్చికొందురు.

త్రికరణశుద్ధిగ భక్తిశ్రద్ధలతో దీనిని బఠించినను, వినినను జనులకుఁ బొందరానిలాభము లెవ్వియులేవు ఇయ్యది ధర్మవిరుద్ధములు గాని సమస్త కామ్యముల నొసంగును. విద్య, బలము, ఆయువు, ఆరోగ్యము, ధనము, ధైర్యము, కీర్తి, తేజము, నిత్యశుభము, జ్ఞానము, శాంతము, ఆనందము, ఆర్జవము, అఖండసుఖము, శౌచము, శీలము, సౌభాగ్యము మున్నగు సమస్త కల్యాణగుణములఁ గలిగించును ఎంతటి మహాపాపములనైన నశింపఁజేయును. సకల విధ మానసికరోగముల నిర్మూలించును. దీని మహిమమింతయని వర్ణించుట కలవిగాదు

నిత్యమును స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు నిమ్మహాగ్రంథ మును జదువుటగాని, వినుటగాని చేయుచు జన్మముల సార్థకములుగ జేసి కొనుడు తులసీరామాయణమునం దాదరవిశ్వాసములు సహజముగ నెవరికి జనింపవో యట్టిజనులు దురదృష్టవంతులు.

జన్మములన్నిటిలో నగ్రగణ్యమగు మానవజన్మ మొందియు నిరం తర శ్రీరామకథా పఠనశ్రవణము లొనర్పనివారి జన్మములు నిరర్థకములు. కావున స్వానుభవమున నేనచించు పలుకులయందు విశ్వాసముంపుడు ఈ వాక్యములు ముమ్మాటికిని సత్యములు సత్యములు సత్యములని ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను

నిత్యమును రామనామమును జపించుడు తులసీరామాయణమును బఠింపుడు, లేక వినుడు, మీకు నెరవేరని యభీష్టము లుండవు.

భారత దేశమునఁ బ్రతిగృహమునను శ్రీ తులసీరామాయణ పారా యణము జరుగుచుండుట దేశ సౌభాగ్యదాయకము ప్రతిదినము నీరామా

యణములోఁ గొంతభాగమైనను, అథమము కొన్ని పద్యములైనను జదువుటగాని, వినుటగాని చేయక యే భుజింపమనియు, నిద్రింపమనియు నియమము చేసికొనుఁడు. నిత్యమును సంసార సాగరతరంగములనుండి స్వల్ప కాలమైనను బైటఁబడి యొక గడియసేపైనను శ్రీ తులసీరామాయణ పఠనశ్రవణములఁ గావించి ధన్యులుగండు. వ్యర్థముగ జనన రుజాజరా మరణప్రవాహ సంసార తరంగిణింబడి మునిఁగిపోవకుఁడు. శ్రీ తులసీ రామాయణము నాశ్రయించి నిత్యకల్యాణముల నొందుఁడు

హిందీ గ్రంథములలో శిరోరత్నమన వెలయు శ్రీరామచరిత మానస్ అను మహాకావ్యము పరమభక్తాగ్రగణ్యుఁడగు శ్రీ తులసీదాస కవి వరేణ్యునిచే **1631** వ సంవత్సరమున రచియింపఁబడినది.

అద్దాని నాంధ్రపద్యకావ్యముగ రచించిన నాంధ్రవాఙ్మయమున కొక యమూల్యాభరణముగాఁ గలదనియెంచి నాకుఁగల కొలఁదిశక్తి ననుసరించి రచించితిని. ఇయ్యాంధ్రీకరణము **1940** వ సంవత్సరముననే విక్రమ చైత్ర శుద్ధ శ్రీరామ నవమీ దినమునఁ బ్రారంభింపఁబడి **1945** వ సంవత్సరమునకు తారణ పౌష బహుళ చతుర్దశి మకరసంక్రాంతి నాటికి ముగింపఁబడినది.

ఇమ్మహాకావ్య ముద్రణమునకుఁ దగినంత సజ్జన సహాయ మలవడమిచే నిందుగల సప్త సోపానములలో తృతీయ సోపానమగు నారణ్యకాండమును చతుర్థ సోపానమగు కిష్కింధకాండమును పాఠక మహాశయుల కందఁజేయ గలిగితిమి. ప్రథమ సోపానమగు బాలకాండమును, పంచమ సోపానమగు సుందరకాండమును నిదివఱకే వెలువడి పెక్కుమంది విద్వద్వతంసుల యొక్కయు, కవి శిరోరత్నముల యొక్కయు భక్తాగ్రేసరుల యొక్కయు, యోగినీమణులయొక్కయు, యోగిశిఖామణులయొక్కయు, బ్రహ్మవిద్వరేణ్యుల యొక్కయు ప్రశంసల నొందుచు విహరించుచున్నవి. మిగిలిన సోపానములుఁ గూడ శ్రీరామచంద్రానుగ్రహమున త్వరలో క్రమముగ వెలువడ గలవు.

ఇందు తొలిపలుకు మొదలు తమతమ యభిప్రాయముల వ్రాసిన విద్వద్వరేణ్యులందఱికిని కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు,
సర్వజన శ్రేయోభిలాషి...
అవ్యయానంద.

# విషయసూచిక

తృతీయ సోపానము — అరణ్యకాండము.

పుట సంఖ్య

చతుర్థ సోపానము — కిష్కింధాకాండము.

ఓమ్

# శ్రీమదాంధ్ర తులసీ రామాయణము

## తృతీయ సోపానము

(అరణ్యకాండము)

---

శ్రీరామప్రభుశేఖర ప్రియుని సచ్చిత్సౌఖ్యసంభూతునిన్
వైరాగ్యాంబుజ భాస్కరున్ వృజినదుర్ధ్వాంతాపహుం దాపసం
హారుం ధర్మమహీజమూలుని వివేకాబ్ధ్యాతతానందకృ
న్నీరేజారిని మోహమేఘపవనున్ నిత్యున్ శివుంగొల్చెదన్. 1

మ. అమితానందపయోదనీల శుభగోద్యద్గాత్రుఁ బీతాంబరుం
గమలాత్యాయత లోచనుం గరలసత్కాండాసనేషుం బ్రభున్
రమణీయోరునిషంగసంయుత కటిభ్రాజిష్ణు జూటాజటుం
గమనీయావనిజాసుమిత్రిజ సమాగ్రస్థుని హరిం గొల్చెదన్. 2

చ. వినుము మహీధరేంద్రసుత విశ్వవినోదనుఁడైన రామచం
ద్రునిగుణముల్ నిగూఢములు యోగి నెఱింగిమునుల్ సుధీంద్రులుం
ఘనమగు రాగహీనతను గాంతురు ధర్మవిహీనులుం జడుల్
వనరుహలోచనాహితులు వాననె మోహితులౌదు రెంతయున్ 3

ఆ. బుద్ధికందినంత పురజన భరతుల
భక్తిఁగూర్చి ప్రీతిఁ బలికినాఁడఁ
జెప్పువాఁడ నిఁక శ్రీరామ చరితంబుఁ
బూత మమర మనుజ మునిహితంబు 4

తే. ఒక్కదినమున శ్రీరాముఁ డొప్పుగులుకు
పుష్పముల హస్తభూషణంబులుగఁ జేసి
జానకీదేవి ధరియింప నలిపి వాని
స్ఫటికశిలనుండిరిరువురుఁ బ్రమదమునను. 5

## శ్రీరాముఁడు కాకరూపజయంతుని భంజించుట

క. నాకాధిపసూనుండొక
కాకాకృతిఁదాల్చివచ్చి కడుదుష్టుండై
వేకదిసిచీమలీల మ
హాకూపారంబు లోతునరయఁజనుగతిన్. 6

క. రామవిభుబలమునరయం
గామిగులన్ మందబుద్ధిగావున నాసు
త్రామ సుతుండూహించుచు
భూమిజచరణంబుఁ జంచుపుటహతిచేసెన్. 7

తే. వాయసాకృతినున్న దుర్వర్తనుండు
మూఢుఁడతిమందమతి జవమ్మునను బాఱె
రక్తమయ్యెమమ్మృదుల చరణమునఁగని
ప్రభుఁడు ధనువున నొక్కశరంబుఁదొడిగె 8

క. పరుఁడు కృపాళుఁడు రాముఁడు
కరుణందీనులను సతముఁగాపాడెడు సు
స్థిరదీక్షితుఁ డాతనియెడఁ
బరమావగుణుండు గపటభావముసూపెన్ 9

తే. మహితబ్రహ్మాస్త్ర మంత్రాభిమంత్రితంబు
శరము వెన్నంటి చనసాగ శక్రసుతుని
భయముచే వాఁడు నైజరూపంబుఁ దాల్చి
తండ్రిసరసకుఁ బరుగిడెఁ ద్వరితగతిని 10

ఆ. రామవిముఖుఁడగుట రక్షింపనాతని
శక్తిలేకవిడిచె శతముఖుండు
చక్రిభీతిఁబఱచి చనిన దూర్వాసుని
గతి నిరాశనొంది కడుభయమున 11

ఆ. బ్రహ్మలోకమునకు భవునిలోకమునకు
సకలలోకములకు శ్రీమయుశోక
మగ్గలంబుగాఁ గనత్యంతజవమునఁ
బాఱెనతఁడు వికలభావుఁడగుచు 12

క. ఈరీతి నెచటికేగిన
శ్రీరామద్రోహియగుటచే నొకరైనం
గారవము సూపకుండిరి
వారింపఁగఁజాలరైరి వచ్చెడుశరమున్ 13

క. కాగభుశుండి మునియనియె
నాగరుడునితోడ వినుము హరివిముఖుండౌ
నోగునకుఁ దల్లి మృత్యువు
లాగగు జనకుండు శమనులాగగు మరియున్ 14

క. అమృతము విషమగు శతరిపు
సములగుదురు మిత్రవరులు స్వర్ణదియేత
త్కుమతికి వైతరణియగున్
సమస్తభువనములు వహ్నిచందమగు సఖా 15

క. దీనుఁడు నతిదుఃఖయుమతి
హీనుఁడునై శక్రపుత్రుఁడేగు కొలఁదినా
దీనశరణ్యుని బాణము
నూనగతిన్ వెంటబడి చనుచునుండఁగన్ 16

ఆ. నారదుండపుడు సునాశీరపుత్రుని
వికలుఁగాంచి సాధు విమలమతులు
కోమలములుగాన గురుకృపజనియింపఁ
బంపెనతని రామభద్రుకడకు 17

ఉ. అంతటవాఁడు వోయి సకలావన దీనశరణ్య యోనిశా
టాంతక శాంతరూప కరుణాలయ పాలయమాం సమస్త వే
దాంత విహారి యంచుఁ జరణాంబురుహద్వయిఁ బట్టి దేవ యా
ద్యంతవిహీన త్వద్బలమునారయఁ గోరితి మందబుద్ధినై. 18

చ. అతులభవన్మహామహిమ మద్భుతమైన భవద్బలంబు దు
ర్మతినగు నేనెఱుంగకతిమత్తతచే నపరాధినైతినో
పతితజనావనా పరమపావన దుష్కృత భుక్తినొందితిన్
వెతనుహరింపవే శరణు వేఁడితి నోడితిఁ ద్రాహిమాంప్రభూ. 19

క. అనియత్యంతార్తుండై
వినయంబున వేఁడికొనెడి విబుధేంద్రసుతుం
గని కరుణాళుఁడు రాముఁడు
దనబాణమమోఘమగుట దయదళుకొత్తన్ 20

ఆ. వానినేత్రమొకటి వరశరంబున కిచ్చి
యొక్కకంటితోడ నుసురునిలిపి
వధయె యుచితమైన వాని మనిచి పంపె
దయకు రాముసాటి దైవమేఁడి 21

ఆ. చిత్రకూటగిరిని సీతావిభుండుండి
వినఁగఁ జెవులకమృత విధముదోఁచు
పెక్కుచరితములను ప్రియమొప్పఁగావించి
యిచటిజనులునన్ను నెఱఁగికొంట 22

క. గుంపులుగా నాసమ్ముఖ
మింపనుచుం గూడి యుండిరియ్యెడ నని భా
వింపుచు సకలమునీంద్రని
లింపులసెలవంది తన చెలియు ననుజుఁడుఁదాన్ 23

## శ్రీరాముఁడు సీతాలక్ష్మణుల సమేతుఁడై యత్రిముని కడకేగుట

తే. అత్రిమున్యాశ్రమమునకు నరుగ నయ్యా
నాదినిధనుని యాగమనాతిహర్ష
వార్తనాలించి యానందవశత మాని
తనువుపులకింప నెదురేగెఁ ద్వరితగతిని 24

ఆ. ఆవిధమునఁ దనకు నభిముఖుండై వచ్చు
నత్రిమునినిఁ గాంచి యవనిజాక
శత్రుఁడాత్రిమున నిలాతలంబున సాగి
ప్రణతిచేసె నతని పాదములకు 25

క. పరమ మునీంద్రుఁ డాతనిఁ
బరిరంభణమాచరించి బహుళ ప్రేమం
దరణికుల మణుల నిరువురఁ
బరిషిక్తులఁగానొనర్చె భక్తిరసమునన్ 26

ఆ. కనులు చల్లబడఁగఁ గమలాయతాక్షుని
యనుపమాన తేజ మరసి యరసి
యాశ్రమమున కేగె నత్రి వారలఁ గొని
యాదరమునఁ బరమ హర్షమెసఁగ

మ. ఫలమూలంబుల విందుచేసె ముని యాపాపాటవీకీలికిన్
ఖలదైత్యాంగజ శూలికిన్ సకల లోకత్రాణ సంశీలికిం
బలభిన్ముఖ్య సురార్థ నిర్వహణ సంప్రాప్తాటవీ కేళికిం
జలజాప్తాన్వయ పద్మహేళికి నసత్సంసార నిర్మూలికిన్ 28

తే. సంతసంబునఁ దన కత్రిసంయమీంద్రుఁ
డర్పణముసేసిన ఫలాదులారగించి
యాసనంబున నున్న ప్రభాసమాన
తేజుఁ గనులారఁగాంచి యత్రిముని వరుఁడు 29

మ. చతురుండాత్మకరద్వయంబు నుదుటన్ సంధించి శుద్ధాత్ముఁడై
స్తుతిచేయంగఁ దొడంగెనిట్లు కమలాక్షుం భక్తవాత్సల్య య
ద్భుతశీలా కరుణాలవాల యమలా తుభ్యన్నమో కామహీ
నతసేవింప భవత్పదంబుజ పదోన్నాళీకముల్ గొల్చెదన్ 30

తే. శ్యామసుందర నిష్కామ సాధురక్ష
భవమహాంభోధి మందర పాపశిక్ష
ఫుల్లకమనీయ సుందరాంభోరుహాక్ష
మోహమద ముఖ్యదోష నిర్మూలదక్ష 31

సీ. ఆజానులంబి బాహార్గళ విక్రమ
పరమాప్రమేయ వైభవవిలాస
తూణీరకోదండ బాణధరావ్యయ
దేవదేవ నిరీశ త్రిభువనేశ
రవివంశమండన భవచాపఖండన
మునిలోకపాలన మోక్షసదన
సురవైరిభంజన సూరిహృద్రంజన
వితత లీలామాత్ర విశ్వనటన

తే. పద్మజాభవముఖ్య సుపర్వవంద్య
రంజిత విశుద్ధ బోధవిగ్రహ యనింద్య
యిందిరానాథ సాధుజనేష్టసౌధ
సకలసుఖధామ శ్రీరామ సార్వభౌమ 32

తే. మరాల శక్త్యనుజసమేత మోక్షదాత
యమరనాథ ప్రియభ్రాత యఖిలనేత
వాసుదేవ నమోస్తుతే స్వప్రకాశ
భక్తవరద భజామి దుర్భవ వినాశ 33

సీ. ఏనరుల్ సతతంబు నిర్వ్యాజహీనులై
భవదీయ పాదపద్మద్వయంబు
భజియింతురో వారు బహుల వితర్కతరంగ
సంకులసంసార సాగరమునఁ
బడఁబోవరెన్నండుఁ బరమాత్మ యేకాంత
వాసులై ముక్తులై యానఁజెంది
నిను ముదమ్మునఁగొల్చు జనులింద్రియాదిక
నిగ్రహంబొనరించి నిత్యమైన

తే. పదవిఁగాంచెద రాశ్రిత పారిజాత
పరమపావనచారిత్ర పద్మనేత్ర
సచ్చిదానందరూప విశ్వప్రదీప
రఘుకుల సుధాబ్ధిచంద్ర శ్రీరామచంద్ర 34

క. ఎక్కటి వద్భుత శీలుఁడ
విక్కమల భవాండమయుఁడ వీహారరహితా
నిక్కముగ జగద్గురుఁడవు
చొక్కంబగు శాశ్వతంపు జ్యోతివి దేవా 35

క. కేవలము గుణాతీతుఁడ
వీవు తురీయుఁడవు సముఁడ వీవిశ్వమునం
భావమునకు వల్లభుఁడవు
కావు గ్రహింపఁగఁగు యోగి గణమున కధిపా 36

క. నిజభక్త కల్ప భూజమ
వజస్రమును సేవసేయ నర్హుండవునిన్
భజియింతు రామచంద్రా
త్రిజగన్నుత కీర్తిసాంద్ర నృపకులచంద్రా 37

క. అనుపమరూప మహీశా
జనకసుతా విమలహృదయ జలజదినేశా
వనజాప్త సోమనేత్రా
తనుతాపలతా లవిత్ర తథ్యచరిత్రా 38

ఆ. నేనమస్కరింతు నీపదాంభోరుహా
భక్తి నాకొసంగి పరమకృపను
బ్రోవుమయ్య నన్ను భువనైక రక్షక
నీప్రసాద మొంది నేసుఖింతు 39

క. ఏనరులీస్తవ మాదర
మూని పఠించెదరొ యట్టి యుత్తములమలం
బైన భవద్భక్తిని మో
దానందముఁ గందురు సంశయము లే దిందున్ 40

క. అని యీవిధమున స్తవమున్
మునికుల వల్లభుఁడొనర్చి మోదముఁ బ్రియముం
బెనగొన నతశిరుఁడగుచున్
వినయంబునఁ గేల్మొగిడ్చి వెండియుఁ బలికెన్ 41

క. నామతి నెన్నండేనియు
రామా భవదీయ చరణరాజీవ పరం
ధామమును బాయనీయకు
మా మఱిమఱి వేఁడికొంటి మనుకులదీపా 42

క. అని ముని తన మనమున ఘన
వినయంబును భక్తిరసము వెల్లివిరియ రా
ముని వినుతించుచు నుండఁగ
ననసూయాంఘ్రిద్వయమున కవనిజ మ్రొక్కెన్ 43

## అనసూయ సీతాదేవితో మానినీ ధర్మములఁ బలుకుట.

క. ఆశీర్వాదమొసంగుచు
నాశీతాంశుముఖి నెత్తి యనసూయ ప్రియా
వేశమ్మున నిజనికటో
ద్దేశాసీనగ నొనర్చి దివ్యాంబరముల్ 44

ఆ. నిత్యనూతనములు నిర్మలినంబులు
నతిమనోహరములు నైనయట్టి
భూషణములుఁ దెచ్చి భూపుత్రిఁ గైసేసె
హర్షమెసఁగ నా మహర్షిపత్ని 45

తే. సరస మృదువచనములఁ బ్రిసంగవశత
మానినీధర్మములను సమ్మతిని వర్ణ
నంబొనర్పఁ దొడంగె భూనాథతనయ
తల్లిదండ్రులు మఱియన్నదమ్ములెన్న 46

క. మితహితకారులు సతికిన
మితహితసంధాత భర్తమొలఁత తనపతిన్
సతతము సేవింప కనా
దృతిచేసిన నధమయని కథింతురుదానిన్ 47

తే. ధైర్యమును జెలికానిని ధర్మగుణము
భార్యనుఁబురుషునకు నాపదలుగలుగు
కాలమందుఁ బరీక్షింపగఁల తెలుఁగు
తెలియుసుఖమున్న తఱినది తెలియఁబడదు 48

క. ధనవయన కర్ణహీనుం
డని రోగియు జడుఁడు వృద్ధుఁడని దుర్మతియై
తనపతి నవమానించిన
వనిత యమపురమున నరకవాసంబుఁగనున్ 49

తే. వనితకు శరీర మానస వచనములను
భర్తృచరణాంబురుహముల భక్తియొకటి
యేవ్రతంబును నియమంబు సిద్ధధర్మ
మింతకంటెను మించిన దెందు లేదు 50

ఉ. వేదపురాణముల్ దెలుపు విజ్ఞులు సాధులు వల్కుచుందురీ
మేదిని నాల్గురీతులయిమించు పతివ్రతలుందురంచు శా
తోదరియుత్తముల్ మఱియు నూహయొనర్పఁగ మధ్యమాధమో
ద్భేదముగల్గువృత్తిఁగల తీవియఁబోండ్లధమాధమాంగనల్. 51

ఆ. అతివసావధానవై వినుమెఱిఁగింతు
వివరముగను వారి విధములెల్ల
నెవరు ప్రీతి దీనినెల్లనాకర్ణింతు
రట్టివారికగు భవాబ్ధిఁగడువ 52

తే. ఉత్తమ పతివ్రతామణు లుల్లములను
నన్యపురుషుల స్వప్నమందైన జగతిఁ
గాంచఁగాఁ గూడదనెడి నిష్కర్షఁగలిగి
యుందురవ్వారి స్మరియింపనొందు శుభము 53

తే. మధ్యమ పతివ్రతాజనుల్ మనములందుఁ
బరపురుషులను నిజపితృభ్రాతృపుత్ర
సములుగా నెంచుచుందురు స్వకులధర్మ
మరసి సద్వృత్తి వర్తింతు రధమలనుచు 5

క. శ్రుతులను నధమాధమలా
పతివ్రతల తెఱఁగు వినుము పతిభయముననో
యితరుల భయముననో తమ
మతులన్ వంచించి యుంద్రు మానితవృత్తిన్. 5

క. పతివంచకయై పరపతి
రతిచేసెడి యతివొందు రౌరవ నరక
స్థితి నూఱుకల్పముల వఱ
కతిపాపిని దానిఁదలఁప నగుఁగిల్బిషముల్. 56

ఆ. క్షణము సుఖముకొఱకుఁ జంచల చిత్తయై
శతసహస్ర లక్ష జన్మములను
దుఃఖమను భవింప దొరకొను తెలియఁగని
తులువ చెలువకంటె దుష్టయున్నె. 57

తే. కపటహీనతఁ బతిభక్తిఁ గలిగిమెలఁగు
లలన పరమ గతింజెందు సులభముగను
పతికిఁ బ్రీతికూల గతిగల పడఁతియెందు
జన్మమందిన విధవయౌ జవ్వనమున. 58

తే. సహజముగ నెన్నఁనపవిత్ర జన్మ సతిది
పతినిగొలిచిన విమలయై పరముగతిని
బొందఁగలుగును లేకున్న భూరినరక
కూపమునఁదెళ్ళి కడలేక కుడుచు వెతల 59

క. పతిభక్తిగలిగి మెలఁగెడి
సతులు నుతింబొందుచుంద్రు సకల జగములన్
సతతముఁ బురాణములు శ్రుతి
చతుష్టయముఁ గీర్తనంబు సలుపును వారిన్ 60

చ. పతియన నీకునెల్లపుడుఁ బ్రాణముకన్నఁ బ్రియంబు నిన్నుస
న్మతి స్మరియించినంతటనె మానినులెల్లఁ బతివ్రతాత్వ సం
స్థితిఁ జరియింపఁగాగలరు చెప్పితినైనఁ బ్రపంచకామినీ
హితమునగోరి రామధరణీశ్వరగేహిని విశ్వమోహినీ 61

క. అని యనసూయ వచించిన
వినిజనకసుతామతల్లి వికసితముఖియై
ఘనమగు ముదమునఁ దత్పద
వనజములకు మ్రొక్కె శిరము వాంచి వినీతిన్ 62

## శ్రీరాముఁడు వేఱొక వనంబునకేగ నత్రిముని నాజ్ఞవేఁడుట

ఉ. అంతఁగృపానిధానుఁడు నవాంబురుహాక్షుఁడు రామచంద్రుఁడ
త్యంత వినీతినిట్లనియె నత్రిమునీంద్రునితోడ దేవ మీ
రెంతయుఁ బ్రీతినాజ్ఞ యిడి రేని మఱొండు వనంబుఁ జేరమ
త్స్వాంతము నందలంచితిఁ సమ్మతి విన్నప మాలకింపుఁడీ. 63

తే. నాపయి సతంబుఁగృపనుంచి నన్ను సేవ
కునిగ మదినెంచి యేమఱకుండు స్నేహ
మనుచు ధర్మధురంధరుఁడ నెడివాక్య
ములను విని ప్రేమ జ్ఞానియా మునివచించె. 64

తే. అబ్జసంభవ హరసనకాది విజ్ఞు
లైన పరమార్థవాదు లెవ్వాని కృపను
గోరుచుందురో నీవట్టి గుణనిలయుఁడ
వార్తబాంధవ నిష్కాము కానురక్త. 65

క. నీ విటుమంజుల మధురము
లౌ వచనము లాడుచుంటి వరసితిని భవ
త్ప్రావీణ్యము పెరవేల్పుల
సేవింపక నిన్నెరతి భజింపంగఁ దగున్. 66

తే. ఎవనితోడ సమానులున్ హెచ్చువారు
నిఖల జగముల లేరట్టి నీకు నిట్టి
విమల శీలంబు గలుగుట వింతయగునె
పరమపావన నామ నిష్పాదధామ 67

క. నీవే తెలుపుము స్వామీ
యేవిధమున నిన్ను నిప్పు డేగు మటంచున్
సేవచియింపుదును నిఖిల
జీవాంతర్యామివగుట సీతారామా 68

క. అనిపలికి ధీరుఁడగుముని
యినకుల వల్లభునిఁజూడ హెచ్చిన ప్రేమం
బునఁగనుగవ బాష్పములుం
దనువునఁ బుల కలును నతివితతమై పొడమెన్. 69

సీ. మనము సమర్పించె నినకులాధిపునకు
నిర్భర భక్తి మునిప్రవరుఁడు
నయనంబు లాజగన్మంగళ మూర్తిము
ఖాబ్జంబుఁ జూచుచు నట్టెనిలచె
నంతట మునివరుండనుకొనె మనమున
నేవిభుకొఱకునే నిద్ధనియతి
జపములుఁ దపములు సలిపితినావిభు
నిర్గుణు నవ్యక్తు నిష్కళంకు

తే. మానసేంద్రియ దళకవిజ్ఞానములకు
నవ్వలవెలుంగువాని సర్వాంతరాత్మ
రామునింగంటి నవినాశసీమనుంటి
ననుచుఁదరుగని సుఖమొందె నత్రిమౌని 70

మ. తులసీదాసు వచించెనిట్లు విబుధస్తుత్యంబు నత్యంతని
ర్మలముం బావనమైనరాము నభిరామంబౌ చరిత్రంబు రా
త్రులు ఘుస్రింబులు నేరు గానమొనరింతో్రి నావు ధర్మంబు ని
శ్చలయోగంబుజపంబుభక్తియును బ్రహ్మంగాంతురంచాదృతిన్ 71

క. కలికలుషంబులడంచు స
కల దుఃఖంబులను బాపు కల్యాణకరం
బలఘుమతివినిన రాముని
కలితయశము రామచంద్రు కరుణయుఁ గలుగున్ 72

తే. కఠిన కలికాలమెంతయుఁ గలుషములకు
నిరవగుటఁజేసి జపతపో నిరతయోగ
ధర్మ విజ్ఞానములును దుస్తరములనుచు
శరణుచొత్తురు రాముని జతురమతులు 73

క. మునిచరణాంబు రుహములకు
ననఘుడు సుర నర మునీశ్వరాధిపుఁడు శిరం
బునువాంచి మ్రొక్కి వేంచే
సెను పిఱుఁద నె లక్ష్మణుండు చేరి నడవఁగన్ 74

క. ముని వేషంబులతోనా
దినకరకులమణు లనంత తేజములొప్పం
గనువిందుసేయుచుండిరి
జనకజ తన్మధ్యమున లసద్గతినెసఁగెన్ 75

క. జీవబ్రహ్మల నడుమం
భావింపఁగ మాయయనఁగ భాసిలె సీతా
దేవి రఘురామ లక్ష్మణ
దేవుల మధ్యమున నతుల దీప్తివిభవమై 76

తే. పర్వతంబులు నదులెత్తు పల్లములగు
స్థలములును వనములుఁ దమ స్వామియనుచు
నెఱిఁగి యుత్తమమగు మార్గ మిచ్చుచుండె
రామచంద్రున కఖిలైకరక్షకునకు 77

తే. ఎచ్చటి కచటికి రఘువీరుఁ డేగుచుండె
నచ్చటచట నభము మేఘములవడఁగఁ
జేసి నీడను గల్పించె శ్రీనివాసుఁ
డంతట విరాధుఁ డేతేర హాత మొనర్చె 78

తే. వెంట నేవాఁడు రుచిరమై వెలయురూప
మొంద నిజధామమున కంపె నురుకృపాబ్ధి
యంత జానకితోడను ననుజు తోడఁ
జనియె శరభంగ మునియున్న స్థలమునకును 79

## సీతారామలక్ష్మణులు శరభంగమునిం గాంచుట.

క. శరభంగుఁ డెంత ధన్యుఁడో
పరమాత్ము మనోజ్ఞవదన పద్మమరందం
బరుసమున నిజనయన బం
భరములచేఁ గ్రోలుచుండెఁ బరవశుఁడగుచున్ 80

తే. కొంతవడికి మునీంద్రుఁ డాకోటి సూర్య
తేజుతో నిట్లు పలికెనో దేవదేవ
రాజశేఖర హృత్సరో రాజహంస
వినుము తెలిపెద నాదగు విన్నపంబు 81

ఆ. బ్రహ్మలోకమునకుఁ బయనమయ్యును రామ
విభుఁడు రాఁగలండు విపినమునకు
నన్న వార్త వించు నహములు రాత్రులు
నరయుచుంటి మార్గ మపటినుండి 82

తే. ఇపుడు నీ దర్శనంబౌట హృదయ తాప
మడఁగి శీతలతంజెందె నంబుజాక్ష
దీనజను నను సాధనహీను నరసి
కరుణఁ జూచితి వెంత భాగ్యము మహేశ 83

తే. ఆ కరుణమాత్రి నాకు శ్రేయంబుగాదు
భక్తమానస హరణ భవత్ప్రతిజ్ఞ
నిలిపితివి మేనువిడిచినే నిన్నుగలియు
వఱకు నుండు మీాదీను పైవత్సలతను 84

తే. అని పలికి యోగ జపతపో యజ్ఞ ముఖ్య
స్వకృత కర్మంబులను రామచంద్రి విభున
కర్పణముసేసి భక్తియేయడిగి సర్వ
సంగములను మనమునుండి సంత్యజించి 85

తే. ఈ విధంబునఁ దగులంబులెల్ల విడిచి
స్వస్థుఁడై కూరుచుండి యాసంయమీంద్రుఁ
డనుజ సీతాసహిత సగుణాకృతి గల
జలదవర్ణత శ్రీరామ సంతతంబు 86

క. వాసమొనరింపు మఖిలా
వాసా నాయెడదఁ ననుచు వరయోగాగ్నిం
జేసి శరీరము మండం
జేసి విఠుంఠంబుఁ జేరె శ్రీరాము కృపన్ 87

తే. ప్రథమమున ముని భేదమగా భక్తిఁగోరె
నందుచే రామునందైక్య మందకుండె
నతని స్థితిఁగాంచి ముని నికాయము విశేష
హర్షముంబొంది రాము నిట్లభినుతించె 88

క. జయదీన సుజన హితకర
జయకరుణామూలకంద జయతుముకుందా
జయరామచంద్రి యచలా
ద్వయ యను తాపసగణంబు దయఁగనుగొనుచున్ 89

## రాముఁడు రాక్షసుల వధించి వనము నిష్కంటకముగఁ జేయుదునని మునుల యెదుట ప్రతిజ్ఞ చేయుట.

క. ముందఱి వనమునకున్ ముని
బృంద సమేతముగ నడచి పేరెముకలరా
శిందిలకించుచు జాలిం
జెంది మునులనడిగె నేమి చెప్పుఁడిది యనుచున్ 90

ఆ. సర్వదర్శకుఁడవు సకలాంతరాత్మ వీ
వెఱిఁగి యెఱుఁగనట్టు లేల యడిగె
దసురులిచట మునుల హత మొనర్చిరి వారి
యస్థులివి యనుచు మహర్షులనఁగ 91

ఆ. కనుల నీరుగాఱఁ గాకుత్స్థకుల నాథుఁ
డిటు ప్రతిజ్ఞఁ జేసె నిలను దైత్య
హీనఁగా నొనర్తు నేనవశ్యంబని
భుజముసాచి కరుణ మునులఁ గాంచి 92

## సుతీక్ష్ణుఁడు సీతారామలక్ష్మణుల సందర్శనము సేయుట.

తే. సకలమున్యాశ్రమములకుఁ జనివిభుండు
వారికెల్లను సౌఖ్యముల్ వఱలఁ జేసె
కలశజుని శిష్యులం దగ్రగణ్యుఁడగు సు
తీక్ష్ణుఁడనువాఁడు విష్ణుభక్తిగలవాఁడు

క. అతఁడు మనోవాక్కాయ
త్రితయముచే రామచంద్రదేవునిఁ దక్కం
కితరులఁ గొల్వఁడు స్వప్న
స్థితినైనను జ్ఞాని మిగుల స్థిరమతియగుటన్ 94

క. రాముని రాక వినుచు న
త్యామోదంబున మనోరథావాప్తికిని
స్సీమ సుఖమ్మంది పరుగిడె
నా ముని మనమునను నిట్టులను కొనుచు వడిన్ 95

తే. ఓవిధీ దీనబాంధవుఁ డురు కృపాబ్ధి
రామచంద్రుండు నాబోటిపామరు శతు
దయను జూచునె యను జయుతముగ నన్ను
నాదరించునె సేవకు నట్లు తలఁచి 96

తే. నామనంబున దృఢమగు నమ్మకంబు
చాలకుండెను వైరాగ్య సంపదయును
భక్తి విజ్ఞాన యజ్ఞ తపములు సాధు
సంగ జపయోగములు లేవు చపలమతిని 97

ఆ. రామచరణ కమలరక్తియు నదృఢంబు
కాని ప్రభునిమాట కలదొకండు
సర్వగతుల నన్యశరణంబు లేకట్టి
జనులు ప్రియులు నాకు నని వచించె 98

క. భవమోచన కర సీతా
ధవ వదనాంభోరుహంబు దర్శించి కనుం
గవగల ఫలమొందెద నని
యవి కారుండై సుతీక్ష్ణుఁ డరుగుచునుండెన్ 99

ఆ. జ్ఞానియగు సుతీక్ష్ణమౌని నిర్భరభక్తి
వివశుఁడయ్యె నతని విమలమైన
స్థితిని వర్ణనంబు సేయంగ శక్యమే
యనియె గిరిజతో ననంగవైరి 100

క. అతనికి దిశావిదిశలను
స్మృతియే లేకుండె మార్గమే నిజచక్షు
ర్గతియ గతముగా నుండెన్
మతిఁ దానెవ్వండొ యెటకమరఁ జనువాఁడో 101

తే. ఎఱుఁగకయె యట్లు కొంత దవ్వేగి యేగి
వెనుకదిరిగి నడవసాగు మునివరుండు
నడుమ నడుమను జానకీ నాథుగుణగ
ణంబు గానంబుసేయుచు నాట్యమాడు 102

క. అవిరళభక్తియుఁ బ్రేమయు
భవభయమోచనుఁడు రామభద్రుఁడు వసుధో
ద్భవముల మాటుననుండియె
యవలోకించి ముని హృదయమందే తోఁచెన్ 103

ఆ. అచలుఁడగుచు మార్గమందె కూర్చుండె న
ప్పరమపావని మేను పనసపండు
కరణిఁ బులకరించెఁ గరుణాబ్ధి సరసిజఁ
జని యావస్థఁగని ప్రసన్నుఁడయ్యె 104

చ. మునివరుఁ బెక్కుసార్లు రఘుపుంగవుఁ డెంతగ మేలు కొల్పినం
గనుగవ విచ్చిచూడఁడు ప్రగాఢ సమాధిని ధ్యానసౌఖ్యముం
గనుచు శరీరవిస్మృతిని గ్రాలుకతంబున నంతరాముఁడా
తనిహృది రాజరూపమునుదాచి చతుర్భుజుఁడై కనంబడెన్ 105

క. మణిపోయిన వికలతఁ గను
ఫణివోలెన్ లేచెపావని బహు వికలత ల
క్ష్మణ సీతాన్విత రఘురా
మ్మణి మ్రోలంగాంచెఁ దనదుమైఁ గలుపారన్ 106

క. కని యనుపమ భాగ్యుండ
మ్ముని ఘనభక్తిన్ మునింగిపొంగి కృపాసిం
ధుని చరణకమలముల వ్రా
లెను దండమువోలె నంజలిబద్ధుండై 107

తే. జానకీవల్లభుండు విశాలబాహు
యుగళమున లేవఁగా నెత్తి యురమునందుఁ
గదియఁగాఁ జేర్చె భక్తాగ్రగణ్యుఁడైన
యమ్మునీంద్రుని బరమప్రియమ్ము మీఱ 108

క. మునితిలకుని నిజదోర్యుగ
మునఁ బెనగొని రామవిభుఁడు పొల్పొందుచునుం
డెను మిగులఁ దమాలతరువు
కనక మహీరుహముఁ గదిసికడు నొప్పుక్రియన్ 109

క. రాముని వదనాంభోజము
నాముని పుంగవుఁడు గనుచు నచలత నిలచెన్
శ్రీమీఱఁగ లిఖియింపం
గా మెఱసెడి చిత్రమందుఁగల ప్రతిమయనన్ 110

ఉ. అప్పుడు ధైర్యమూని మునియా రఘురాము పదాంబుజంబులన్
ముప్పిరిగొన్న భక్తియును మోదమెసంగఁగ వ్రాలివ్రాలి తా
నప్పరమాత్ముఁ బ్రీతిని నిజాశ్రమ సీమకుఁ గొంచుసేగి మే
లొప్పగఁ బూజచేసెఁ దనయుల్లముచల్లగఁ బెక్కుభంగులన్ 111

ఉ. పూజలుసేసి హస్తయుగమున్ ముకుళించుచుఁ గోటిభాస్కరో
త్తేజునితోడ నిట్లనియె దేవయొనర్చెద విన్నపంబు నే
యోజపనున్ నుతింతు భవదుజ్జ్వలమా మహిమంబనంతమా
నేజడుండన్ మదీయమతి యెంతయు నల్పము జానకీశ్వరా 112

క. భవదీయ మహిమ ముందఱ
నవలోకింపఁగ మదీయమగుబుద్ధి స్ఫుర
ద్రవి ముందఱ ఖద్యోతం
బువలెం జూపట్టు నెట్లు పొగడుదు నిన్నున్ 113

తే. శ్యామతామరసాభాంగు జటిలమకుటు
వల్కలాంబర పరిధాను వరశరాస
నేషుహస్తునిఁ గటితట ధృతనిషంగు
వినతిమ్రొక్కెద రఘువీరు ననవరతము. 14

క. ఘనమోహావన కృశాను సు
జనగణ వనజవన భాను సమదాసుర హా
స్తినివహ కేసరి భవ ప
క్షినికాయ శ్యేను రక్షసేయఁగఁ గొలుతున్. 115

మ. తరుణాంభోరుహనేత్రు సుందరతనుం ధాత్రీసుతాలోచన
స్ఫురదాకార చకోరపూర్ణ కుముదాప్తుం బాల శీతాంశుశే
ఖర హృచ్చారు సరోమరాళు నురుదీర్ఘ స్ఫార బాహుం జరా
చరభూతాత్మకు రాముఁ గొల్చెద నమస్కారంబుఁ గావించుచున్

శా. సందేహోరగ వైనతేయుని మహాసంతాప కృత్తర్క వా
క్సందోహోపశముం భవప్రహరణున్ సర్వేశ్వరుం దేవతా
బృందానందకరుం గృపారస మహాబ్ధిన్ నిత్యునిన్ నిర్మలుం
గందర్పాయుత సుందరుం గొలుతు నెక్కాలంబు రఘూర్థినై. 117

తే. ఇంద్రియ జ్ఞానములకును నెట్టివైన
మాటలకు మించు విషమ సమస్వరూపు
సగుణు నిర్గుణు భూభార శమను నమలు
నఖిలు ననవద్యుని నపాను నాశ్రయింతు. 118

ఆ. భక్తనివహ కల్పపాదపారాముని
గామ లోభముఖ వికారహరణు
నతుల చతురు భవమహాంభోధి సేతువు
నర్కకులపతాకు నాశ్రయింతు. 119

తే. అతులిత భుజప్రతాప బలాదిధామ
కలికలుషచయ భంజనకర సునామ
ధర్మకవచమ సౌఖ్యప్రద గుణసీమ
సతత శుభమిమ్ము నీరద శ్యామరామ 120

తే. శుద్ధుఁడవు నవినాశివై చూడ సతము
వ్యాపకుఁడవు నఖిలాంత రాత్మవయ్యు
జానకీ లక్ష్మణులఁగూడి సాంద్రవనులఁ
దిరుగు నీవుండు మెప్పుడు మద్ధృదయమందు. 121

అగుణుని నంతర్యామిని
సగుణుని నిన్నెవ్వరెఱుఁగఁ జాలుదు రెఱుఁగం
గఁగలారు వారలే కృహ
ముగఁ జేయుము నాదుహృదయమున్ నీకధిపా. 122

తే. శ్రీరఘుస్వామి విభుఁడు నే సేవకుఁడను
ననెడి యభిమానమే సమయమునమైన
మఱపుగాకుండఁ గాక మన్మానసమున
ధరణిజానాధ భవదీయ పరమకృపను 123

క. అనిన సుతీక్ష్ణుని పలుకులు
విని జనక సుతావిభుండు వితతముదంబుం
గనితోడనె గాఢాలిం
గనముంగావించి యతనిగని యిట్లనియెన్ 124

క. పరమప్రసన్నుఁడనైతిని
వరమడుగు మవశ్య మొసఁగువాఁడ ననిన నీ
శ్వర వరమడుగ నెప్పుడు సు
స్థిర సత్యాసత్యములను దెలియని కతనన్. 125

క. ఎదిమంచి వరమనుచు నీ
హృదయంబున నెంచుచుఁవాఁడ విప్రాదినాథున్
సదమల భక్తసుఖప్రద
మదన హరారాధ్య పరమపావని సుబోధ్యా. 126

క. అవ నవిరళ భక్తియు హై
చ్చినవైరాగ్యంబు జ్ఞాన సిద్ధియుఁగని నీ
వనుపమగుణ ఖనివి వివే
కనిధివినై వెలయు మనుచుఁ గమలాత్ముఁడనన్. 127

ఆ. అధిప నీవొసంగి నట్టి వరంబును
బొందినాఁడ నాకు ముద మొసంగు
నొక్కవరముఁ గోరుచున్నాఁడ నదికూడ
నాదరమున నొసఁగు మంబుజాక్ష. 128

క. సీతాలక్ష్మణ యుతముగఁ
జేతధనుర్బాణములు లసింపఁగ నన్మ
చ్చేతో గగనము నందున్
శీతాంశుఁడంవై సదా వసింపుము రామా. 129

ఆ. అదెమదీయకామ్య మననట్లయగుఁ గాక
యనుచు శ్రీనివాసుఁ డయ్యగస్త్య
నాశ్రమమునకేగ నభిలాష జనియింప
ననుజ జానకీ సహాయుఁడగుచు. 130

## శ్రీరాముఁడు సీతాలక్ష్మణ సహితుఁడై యగస్త్యాశ్రమమునకు కేగుట.

క. ఇనకుల తిలకుండుండఁగ
ననియె సుతీక్ష్ణుండు గురుని యాశ్రమమునకుం
జని యాతని సందర్శన
మొనరించి బహుదినములయ్యె నురుసుఖ రాశీ. 131

క. కావున మీతో నిప్పుడు
నేవచ్చెద మీకుపకృతినేఁ జేయుటకా
దోవరద యనిన రాముఁడు
పావరజుఁడు నవ్వి చనియె నాతనిఁ గొనుచున్.

తే. మార్గమునఁ బ్రీతి నిజభక్తి మహిమఁ గూర్చి
పలుకుచును దేవతా సార్వభౌముడయ్య
గస్త్య నాశ్రమముం జేరఁగనె సుతీక్ష్ణుఁ
డాత్మ గురునకు వందనం బాచరించి.

సీ. దేవకోసల రాజతిలకు కుమారుండు
సకల లోకాధార సత్ప్రకాశుఁ
డనవరతంబు మీరహములు రాత్రిలు
జపియించు దైవంబు శాశ్వతుండు
జానకీ లక్ష్మణ సహితుఁడై మిముఁ జూడ
నేతెంచె నిటకు సర్వేశ్వరుండు
రామచంద్రుండన నామాట వినుటఁ
బడినంత నే సరభసముతోడ

తే. లేచిపరువెత్తె నెదురుగా మేచకాభ
వర్ణు దర్శింపఁ గలశోద్భవముని వేగ
నతని చరణాంబురుహముల కన్నదమ్ము
లిర్వురున్ మ్రొక్కఁ దమిఁ గౌగలించెవారి.

తే. కనుల హర్షాశ్రులొలుక శ్రీకాంతుఁగాంచి
కుశలమడిగి మునీంద్రుఁడగ్గుణ నిధులను
తోడుకొనివచ్చి భాగ్యవంతుండు నాకుఁ
దుల్యుఁడెవఁడని యాసనస్థుల నొనర్చి.

శా. సంతోషంబునఁ బూజసేయఁ దొడఁగెన్ సర్వంసహా కన్యకా
కాంతున్ శాంతశమాది సద్గుణగణాక్రాంతాత్మవిల్లభ్యునే
కాంతుం గేవలు నాదిదేవు ఖలశిక్షాదక్షు నక్షీణు వే
దాంతానంతనుత ప్రభావు భవముఖ్యాదిత్యసంపూజ్యునిన్. 136

ఆ. మఱియు నచటనున్న మౌని బృందం బెల్ల
సకల సుఖనిధాను జానకీశుఁ
గనులనిండఁగాంచి ఘనహర్ష సుధాం
భోధి మగ్నమగుచుఁ బొందెసుఖము. 137

ఆ. అఖిల మునిగణమున కభిముఖుఁడై రామ
చంద్రుఁడుండ వదన శారదేందు
దర్శనం బొనర్చెఁ దాపస నయన చ
కోరవార మధిక కుతుకమునను. 138

క. మునినాథుఁగాంచి రాముం
డనె దేవా మీకు నెపుడు నవగతమైకోఁ
పనిదెందు లేదు నేవ
చ్చిన హేతువు మీకె తెలియుఁ జెప్పఁగ నేలా 139

తే. ముని జనద్రోహకరులఁ జంపుటకుఁ దగిన
మంత్ర మెఱిఁగింపఁ డిపుడు ప్రేమమున నాకు
ననుడు విని ముని చిఱునగ వాననమున
నెసఁగ నడిగెదవేల నీ వెఱుఁగ నట్లు. 140

చ. నినుభజియించు హేతువున నే నొక యించుక నీయనూనమా
యను దెలియంగలాఁడ వృజినాంతక నీఘనమాయ మేడిచె
ట్టనఁదగుఁ బద్మజాండ నివహంబు ఫలావళి వానిలోని ప్రా
ణినికరమా ఫలంబులను నిండిన కీటకకోటి నాఁదగున్. 14

తే. ఆఫలంబుల భక్షించు నతికరాళ
కాలమును నీభయంబునఁ గ్రిమముతోడ
సంచరించుచునుండును సకలమునకు
స్వామి వీవయ్యు మనుజుని చందమునను. 14

తే. అడుగుచుంటివ దేల నన్నాదిదేవ
జనకపుత్రి సుమిత్రిజ సహితముగను
నాహృదయముననుండు మనాథనాథ
యనవరత మీవరంబు నే నభిలషింతు. 14

క. సంతత సత్సాంగత్య మ
నంతంబగు భక్తి తావకాంఘ్రి సరోజా
త్యంత దృఢ ప్రీతియు ధృతి
శాంతియు వైరాగ్యమిమ్ము సత్కృపనాకున్, 14

తే. బ్రహ్మము నఖండము ననంత పదమునైన
ననుభవమునకు గమ్యమై యలరు దేని
సాధుజనులు భజింతురు సంతతంబు
నట్టి నీరూప మెఱిఁగి నేనభిరుతింతు. 1

క. ఐనను సగుణ బ్రహ్మం
బైననినున్ మరల మరల నారాధింతున్
బూని/ నీదాసులకున
హీనంబగు ఘనత నిలుప నెంచెద వెపుడున్, 14

తే. అందుచేతనె నన్ను నట్లడిగినావు
జానకీశ మనోహరమైన తావు
కలిత పంచవటీ నామకము విమలము
దండకాటవి నతిపునీతముగఁ జేసి. 14

తే. ఉగ్రముని శాపహరణంబు నొనరఁజేసి
యందు వసియింపు మెల్లరానందమంద
సకల ముని బృందమును దయాసాంద్ర దృష్టి
నరయుచుండుము భక్తజనార్తిహరణ. 148

తే. అనుడు మునియాజ్ఞనొంది ధరాత్మజా సు
మిత్రపుత్ర సమేతుఁడై మిత్రకుల ప
విత్రుఁడరిగి సమీపించె వేగముగను
పావనంబగు పంచవటీవనంబు. 149

## జటాయు సందర్శనము, పంచవటీ నివాసము.

తే. అచ్చట జటాయువనెడి ఖగాధినాథుఁ
డెదురుపడ రాముఁడతనితో నెన్నరాని
ప్రీతి భాషించి గోదావరీ తటమునఁ
బర్ణశాల వసించె నేర్పరుపఁ జేసి. 150

ఉ. ఎప్పటినుండి రామవసుధేశుఁడు పంచవటీ నివాసియై
యొప్పెనో నాటినుండి సుఖమొందుచు నుండిరి మానులెల్లరుం
జెప్పఁగరాని సుందరతచే విలసిల్లెనదుల్ తటాకముల్
గొప్పమహీధరంబు లనుకూలత నిత్యమనోహరంబులై. 151

చ. ఖగమృగకోటి హర్షమునఁ గాననమందుఁ జరించుచుండె నిం
పుగరొదసేయుచుండెఁ గడుపొల్పును జెంది మిళిందబృందముల్
జగదధినాథుఁడైన గుణసాంద్రుఁడు రాఘవుఁడున్న కానఁబ
న్నగపతియైన వర్ణన మొనర్పఁగ నేర్పరిగాఁడు చూడఁగన్. 152

## శ్రీరాముఁడు లక్ష్మణునకు భక్తి జ్ఞాన వైరాగ్యమాయా జీవేశ్వర ప్రకారంబెఱింగించుట.

క. ఒక సమయంబున సుఖియై
సకలాంతర్యామి యున్న సమయంబున వే
డుక మీఱఁ బరమభక్తిన్
ముకుళిత కరుఁడగుచు లక్ష్మణుండిట్లనియెన్. 153

క. సుర నర మునీంద్ర సచరా
చరనాథా నీవు నాకు స్వామి వనుచు ని
ర్భరభక్తి నడుగుచుంటిని
పరమాదరమొప్ప బోధపఱుపంగదవే. 154

తే. సకలమును మాని భవదీయ చరణసేవ
సలుపఁ గల శక్తి యేరీతి సంభవించు
నదియు జ్ఞాన విరాగమాయా విధములు
తేటపడ నాకు వివరించి తెలుపు మనఘ. 155

ఆ. ఎట్టి భక్తివలన నీశ్వరేశ్వర భవ
ద్దయ లభించునట్టి తతపవిత్ర
భక్తిఁగూర్చి నాకుఁ బ్రస్ఫుటంబుగ బోధ
సేయఁ బ్రార్థనంబు సేయుచుంటి. 156

క. కేవల సౌఖ్య ప్రదమగు
తావక పదభక్తి గలిగి తతభ్రమమును శో
కావిల మోహము లెడలఁగ
జీవేశ్వర భేదమెఱుఁగఁ జేయుము కరుణన్. 157

క. అని యడిగిన రాముండి
ట్లనియెన్ వత్సా కరంబు నవధానముతో
విను మెఱిఁగించెదఁ గొలఁదిగ
వినవలసిన వెల్ల నీకు వివరముగాఁగన్. 158

ఆ. నేను నాది నీవు నీదియంచు వచించు
భ్రాంతి జన్యమైన పలుకె మాయ
యట్టి మాయయందె యఖిలజీవులుఁ జిక్కి
పరవశత్వమొంది భ్రమయుచుంద్రు. 159

తే. ఇంద్రియములకు మనమున కెద్ది గోచ
రించుఁ బలుకులచే వివరింపఁ దగిన
దెద్దియయ్యది యేమాయయెఱుఁగు మదియు
విద్యయు నవిద్య యన రెండు విధములగును. 160

ఆ. అందవిద్యదుష్టమతి దుఃఖరూపిణి
దానివశత జీవతతి భవాంధ
కూపమునను ద్రెళ్లి కుడుచును బహువిధ
వ్యథల సత్పథంబు నరయలేక. 161

క. త్రిగుణములుఁ దనవశములై
నెగడఁగ జగముల రచించు నిజబలమునఁగా
కగణిత తేజుని సాన్ని
ధ్యగతయగుచు నదియె విద్యయనఁబడువత్సా. 162

తే. ఏమనుజునకు నభిమానమొందు లేక
యన్నిఁట సమానముగ బ్రహ్మనరసి చూచు
నట్టివానిని విజ్ఞానియనఁగఁ జెల్లు
నతని సామాన్యమానవుండనఁగ దగునె. 163

తే. త్రిగుణముల సర్వసిద్ధులఁ దృణమువోలెఁ
ద్యాగమొనరించు నెవఁడు విరాగియతఁడె
యెవఁడు దన్నును మాయను నీశ్వరునినె
ఱుంగఁడో వాఁడె జీవుఁడనంగఁ బరఁగు. 164

తే. సకలజనులకు బంధమోక్ష ప్రదుండు
సర్వమునకును బరుఁడు నీశ్వరుఁ డతండె
యతఁడు మాయకుఁ బ్రేరకుండగుచు నఖిల
సీమయైయెప్పు జనులకు సేవ్యుఁడగుచు. 165

తే. ప్రథిత ధర్మంబువలన వైరాగ్యమొదవు
యోగమున జ్ఞానమలవడుచుండు నట్టి
జ్ఞానమే మోక్షదంబని సర్వవేద
ములును వర్ణించుచుండు నిచ్చలును వత్స. 166

తే. భక్తజనులకు నతి సుఖప్రదమయి తగు
నేవిమల భక్తివలన ద్రవింతు నేను
శీఘ్రముగ నయ్యదియెసుమ్ము శ్రేష్ఠమైన
భక్తియనఁబడునది నాకు పరమహితము. 167

క. దానికధీనములగు వి
జ్ఞానము జ్ఞానమదిమఱియు స్వాతంత్ర్యంబౌ
దాని కితరావలంబన
లేనేలే దతులసుఖ ఫలితమది యొసఁగున్. 168

క. అనుకూలురైన సాధుల
కనవరతము నట్టి భక్తియలవడుఁ దత్సా
ధనఁగూరిచి వర్ణించెద
విను నను జెందఁగ పథము భువిన్ ప్రాణులకున్. 169

తే. ప్రథమమున భూదివిజపాద భక్తిఁగలిగి
వేదచోదిత నిజనిజ వృత్తి ననుస
రించి కర్మంబులను నాచరించుచుంట
తగును విషయవిరక్తి యుద్దానఁగలుగు. 170

తే. అందువలనను మచ్చరణానురాగ
ముదయమగు దానివలన సముద్భవించు
శ్రవణముఖ నవవిధభక్తి సదృఢమగుచు
నంత నాలీలలన్ రతియతిశయించు. 171

ఉ. సాధుజనాంఘ్రిపంకరుహ సత్ప్రియమొంది మనోవచః క్రియా
రాధననిచ్చలుం దృఢతరంబగు నేమముతోడఁ జేయుచుం
బోధకుఁడౌ గురుండును బ్రభుండును దైవముఁ దల్లిదండ్రులున్
నాథుఁడు నేనయంచు మదినమ్మి భజించెడునట్టి వానికిన్. 172

కం. నాగుణగానము సేయుచు
మైగఱుపారంగఁ బలుకు మాటలలోనె
తేగాద్గద్యము దోఁపఁగ
వాగులుగాఁ గనుల హర్షవారి జనింపన్. 173

కం. పొంగెడు వానికదంభుఁడ
సంగుఁడుఁ గామాదిప్రబల శాత్రవవిజయా
భంగదృఢ చిత్తుఁడగుచు మె
లంగెడు వానికిని వశుఁడ లక్ష్మణ యెప్పుడున్. 174

కం. వచనమనః కర్మంబుల
నచలత నిష్కామియగుచు సన్మద్భజనం
బచరించుచు ననుగతియను
సుచరితు హృదయముననుండుఁ జుమివిశ్రాంతిన్. 175

చ. అని రఘురామచంద్రవిభుఁ డాదర మొప్పఁగ భక్తియోగమున్
వినిచిన లక్ష్మణుండు విని వేడుక మీఱ సుఖంబునొంది రా
మునిచరణాంబుజంబులకు మూర్ధము సోఁక నమస్కరించె ని
ట్లనయముఁ బుణ్యగోష్ఠిని నహంబులు కొన్ని క్రమింప నత్తఱిన్.
176

## శూర్పణఖా పరాభవము.

సీ. రావణుభగిని శూర్పణఖనాఁ జనునింతి
యతి దుష్టహృదయ సర్పాంగన యన
దారుణ భయదవర్తనయది యొకపరి
పంచవటికి నేగి భానుకోటి

తేజులనిరువుర రాజకుమారుల
నతిలోకసుందరులైన రామ
లక్ష్మణులంగాంచి లావణ్యమున్ మెచ్చి
యంగజవ్యాకులితాత్మయయ్యె

తే. వినుము ఫణివైరి సుందరుఁగనినఁ బొలఁతి
కరఁగు రవిమణి దినమణిఁ గనికరంగు
కరణి వావిఁదలంపక కవయఁగోరు
ననియెఁగాకభుశుండి విహంగపతికి. 177

తే. అట్లు మదనాకులాత్మయై యసురకాంత
రమ్యరూపంబు ధరియించి రాముఁజేరి
మిగులనవ్వుచుఁ దలయూఁచి సొగసుగులుకఁ
బలికెనీరీతి శ్రీరామభద్రుతోడ. 178

క. నీసాటి పురుషవరుఁడును
నాసాటి లతాంగి జగమునన్ లేరుసరో
జాసనుఁడీ సంయోగముఁ
జేసె విచారించి మనకుఁ జిత్తజరూపా. 179

తే. నాకు ననురూపవరుఁడు గానంగరాక
దిరిగిచూచుచునుంటి నే జగత్త్రితయమునను
కన్యనైయుంటి నిన్నిటఁగంటి మెచ్చి
కొంటినొక కొంతయునఁగ రక్షోవినోధి 180

తే. సీతదిక్కుఁజూచి స్త్రీయున్నదిదె నాకు
నాయనుజునిచెంత నాతిలేద
నఁగ దనుజకాంతయంగజ వివశయై
చనె సుమిత్రిపుత్రుని సరసకంత. 181

క. రిపుసోదరిగా నెఱిఁగి య
ధిపుఁగని లక్ష్మణుఁడువలికెఁ దియ్యంబుగ నా
చపలాక్షితోడ సుందరి
నృపుఁడాతఁడు సేవకుఁడను నేనల్పుండన్. 182

క. తరుణి పరాధీనుఁడ నా
సరసన్ వసియింప నీకు సౌఖ్యము లేదీ
శ్వరుఁడతఁడు కోసలకుని
ర్భర సామర్థ్యముగలాఁడు బాగరియగుటన్. 183

క. తగునెయ్యది యొనరించిన
మృగలోచన నీకుఁదగిన మిండఁడతఁడు నీ
సొగసునకు నాదృశుండగు
మగఁ డసమర్థుండుతగునె మగువా చెప్పుమా. 184

ఆ. సేవకుండు సుఖముఁజెందఁ గోరుటయును
భిక్షుకుండు గౌరవింపఁ బడఁగ
నభిలషించుటయును వ్యసనుండు ధనమును
గాంక్షచేయుటయును గరిత మఱియు. 185

తే. సద్గతికి వ్యభిచారి యాసపడుటయును
లోభి యశమొంద నెడఁద నాలోచనంబు
సేయుచుంటయుఁ జారుఁడు చిత్తమందు
స్వాభిమానంబుఁగలిగి మాటాడుటయును 186

తే. పాలకొఱకాసఁ జెంది నభమునఁ బిఱుకు
రీతియగుఁజుమ్ము నమ్ము మోనాతియనుచు
రామచంద్రునికడకు నారక్కసి చనఁ
గ్రిమ్మరంబంపె విభుఁడు లక్ష్మణునికడకు. 187

తే. అట్లుకఱ్ఱిమ్మరఁ దనపాలికరుగుదెంచి
నట్టి శూర్పణఖంగాంచి యని మొనతఁడు
లజ్జవిడనాడు నాతఁడో లలన నినువ
రించు నంచదివిని విజృంభించి మరల.

క. అవమానంబున మందుచు
నవలోకింపఁగ భయంకరాకారముతోఁ
ప వికారాననయగుచుం
భువనాధీశ్వరుని కడకుఁబోయెఁ గడువడిన్.

క. దానింగనుఁగొని మిగులం
జానకి భీతిల్ల రామచంద్రుఁడుగని యా
త్మానుజుతోడన్ సంజ్ఞగ
నానిపుణుఁడు దెలుపనతఁడు నతిశీఘ్రముగన్.

ఆ. దానిముక్కుఁజెవులు లేనిదానిగఁజేసె
రావణునికి నిజకరములతోడ
బుద్ధిచెప్పెననఁగ భూతమోయననొప్పె
నతి కరాళరూపయగుచు దనుజ.

క. గైరిక ఝుకులన శోణిత
ధారలు ఘోరున స్రవింప ధరణీధరమో
నారాక్షస కామిని వి
స్తారంబుగ మేనురుధిర ధారలఁ దడియన్.

క. గిరులు ప్రతిధ్వని సేయఁగ
నురురవమున రోదనంబు నొనరించుచు స
త్వరఁబఱచి ఖరునిదూషణుఁ
బురుషతయును బలము మీకుఁబొలిసెనె యనుఁడున్.

క. అది యేమని వారడుగఁగ
నదిజరిగిన దెల్లఁ దెలుప నతికోపమునం
బొదలుచుఁ బెక్కులు రక్కసి
కదుపులఁ గూర్చుకొని నడవఁ గడఁగిరి వడిగన్. 194

క. తండోపతండములును
ద్దండభయంకరములగుచు దనుజబలంబుల్
మెండెఱకలుగల కాటుక
కొండలకిరియ నడువఁదొడఁగెఁ గువలయమదురివన్. 195

క. నాసాకర్ణ రహితయగు
నాసురి శూర్పణఖ యశుభమగు రూపముతో
నాసైన్యమునకు ముందఱ
నాసరసిజనేతుని మనికి కధ్వముసూపన్. 196

క. నానావిధ వాహనములు
నానావిధరూపములును నానాయుధసం
తానముతో ఘోరములై
సేనలువోవంగఁ దొడఁగెఁ జెచ్చెరనడలన్. 197

తే. అశుభశకునము లెన్నియో యతిభయంక
రముగఁగను పట్టవాని నారాక్షసులు గ
ణింపకే యేగుచుండిరి తెంపుచేసి
మరణవశులౌట్ల నత్యంతమత్తులగుచు. 198

క. గర్జించుచు నొండొరులం
దర్జించుచు నింగిముట్ట దాటుచుఁ గడిమిన్
నిర్జరవైరులు వికట
స్ఫూర్జిత భటులఁగని ముదముఁ బొందుచుఁ దమలోన్. 199

క. ఒండొరులను కొనిరిపుడు
ద్దండత నసిచేసి యన్నదమ్ము లిరువురం
గండలుడులిచి గెలిచియా
యండజయానను హరింత మతిమోదమునన్ 200

క. అని యనుకొనుచుం జనుచో
వినువీధిం గ్రమ్మెదూళి విస్తారముగాఁ
గనుఁగొని శ్రీరాముఁడు తన
యనుజునితో నిట్టులనియె నసురబలంబుల్. 201

క. చను దెంచెఁ గాన జానకిఁ
గొనిచని నీవొక్క యద్రిగుహానుండు మనం
ధనువును శరములుఁ గైకొని
చనెనాతఁడు జనకపుత్రి సహితముగాఁగన్. 202

## ఖరదూషణాది రాక్షస సంహారము.

తే. అంత దానవ సందోహ మరుగుదెంచె
నగ్నిఁబడు శలభవ్యూహమనఁగఁ జెలఁగి
కాంచినవ్వుచు రఘువంశ కమలహేళి
కఠినకోదండమెక్కిడె ఘనత మెఱయ. 203

క. శిరమున జటాకిరీటము
సరిచేయుచునున్న రామచంద్రు కరంబుల్
పరఁగెన్ మరకతగిరిపై
స్ఫురిత తటిత్కోటినొరయు భుజగయుగముగన్. 204

తే. కటినిషంగంబు ధరియించి ఘనభుజమునఁ
జాపముంబూని విశిఖముల్ సక్కఁజేసి
సమదగజఘటల్ గాంచు కేసరియనంగ
రాక్షసావళిఁ గనుచుండె రామవిభుఁడు. 205

క. ఏకాకియగుచు బాలది
వాకరుఁడన నొప్పు రామవల్లభుఁగనుచున్
మూఁకలుగఁ జుట్టుముట్టిరి
కేకలిడుచుఁ బట్టుఁడని వికృతముఖదనుజుల్. 206

క. పతిఁగని దను జానకిని
యతిచకితంబయ్యె నతని నమ్మొలనేయం
ధృతిచాలక ఖరదూషణ
దితిజాధములనిరి మంత్రిదెసఁగనుఁ గొనుచున్. 207

క. నరభూషణుఁ డగు నితఁడొక
ధరణీనాయక సుతుండు దనుజమనుజభే
చరఫణి మునిగణమును ము
న్నరసితిమి జయించియుంటిమనిఁ గొండటినిన్. 208

క. కొండటిఁ బరిమార్చితి మీ
చందంబగు స్వప్రకాశు జలజాతాక్షున్
సౌందర్య నిధిని గానము
ముందెన్నఁడు జన్మమాది ముల్లోకములన్ 209

ఆ. చెల్లెలిని విరూపఁ జేసినప్పటికిని
యనుపమాన పురుషు హాతమొనర్పఁ
దగదటంచు మాకుఁదలఁపు జనించెను
గాన నీవుపోయి వానితోడ. 210

క. సీతొయ్యలినెటదాచితి
వా తెలవన్ మాకునిచ్చి యరుగుము సుఖివై
సీతమ్మునితో నింటికిఁ
బ్రీతిననుము మానుడులుగ ప్రియసఖసతియున్. 211

క. ఆతండేమి వచించునో
మాతో వివరింపు మెంతమాత్రము తడవుం
జేత తగదంచుఁ బంపఁగ
దైతేయామాత్యుఁడేగె దాశరథిఁగనన్. 212

తే. అట్లుచని ఖరదూషణులాడు మనిన
పలుకులను వినిపింప నాపరమపురుషుఁ
డల్లనన్ నవ్వియిట్లనె నడవులకు మృ
గయులమై వచ్చితిమి మేము క్షత్రియులము. 213

క. మిముబోటి దుష్టమృగముల
నెమకుచునుంటిమి వధింపనిరుపమ బలవ
ద మతునిఁ గనినను దలఁకము
యమునైనను లెక్కసేయ మాలమునందున్. 214

క. మనుజులమైనను భీకర
దనుజాంతకులము సమస్త తాపససుజనా
వనులము ఖలసంహారణం
బొనరించెడి బాలకులము నురు శక్తులమున్. 215

ఆ. బలముసాలకున్నఁ బాఱుఁడిండ్లకు మేము
సమరవిముఖులైనఁ జంపఁబోవ
మెట్టివారినైన నెట్టన రణమున
మార్తుదయఁ దలఁచుట మాయసేత. 216

క. కాతరత యగుననఁగ విని
దూతచని వచించెను ఖరదూషణులకు నీ
రీతి నతండనెనని విన
నాతతముగ మండెనెడఁ దలాదైత్యులకున్. 217

ఆ. అంతవారు పట్టుఁడనినంత రాక్షస
భటులు చటుల వికట భావులడరి
శరశరాసనముల శక్తిశూలగదాసి
పరశుముఖ్యములను బట్టివేగ. 218

క. కదియఁగఁ బాఱఁగ వారల
హృదయంబులువగులఁ జెవులువ్రీలఁగ భీతి
ప్రదబాణాసన టంకృతి
పదిదిశ లవియంగ రామభద్రుఁడు సేసెన్. 219

తే. ఆనినాదంబు విని యాతుధానులెల్ల
బధిరులై జ్ఞానహీనులై భయవివశతఁ
జిత్తరువులోయనంగ నిశ్చేష్టులగుచుఁ
గొంతవడికిఁ దెలిసి రఘుకులపతిఁగని. 220

క. అరిబలవంతుఁ డనుచును
ద్ధురవేగంబునను గదిసి దోర్బలమెసఁగం
దరణికుల వరునిపై శర
పరంపరల శస్త్రకుంత పరిఘలఁ గురియన్. 221

క. జలజ దళాక్షుఁడు రాముఁడు
తిలలంతలుగాఁగఁదునిమె దితిజులుతనపై
నలఘుతఁ బఱపిన యాయుధ
ములఁ బదపడిచేతఁ జాపముం గొనివేగన్. 222

శా. ఆకర్ణాంతముగాఁగ వింటను విభుండస్త్రాళి సంధించియ
న్నాకౌనీక విరోధియూధములు దైన్యంబొందఁగానే యను
గ్రాకారంబుగ భీకరోరగసమూహం బుద్ధతిన్ ఫూత్కృతుల్
వీకంజేయుచు నేగుదెంచినగతిన్ వే వచ్చినంగాంచుచున్. 223

క. విచ్చుచుఁ జెల్లాచెదరై
యచ్చండ పరాక్రములగు నాసుర యోధుల్
చచ్చితిమతి వాపోవుచు
విచ్చలవిడిఁ బాఱవారి విధమారయుచున్. 224

క. త్రిశిర ఖరదూషణులు త
న్నిశాచర భటులకనిరి నిలువక నానా
దిశలకుఁ బఱచిర యేనిన్
విశసింతుమటంచుఁ గ్రోధవిహ్వలు లగుచున్. 225

చ. అదివిని వారలెల్ల హృదయంబుల నిట్లని నిశ్చయించి రీ
కదనమునందు నిల్చినను గాసిలిపాఱిన నెట్టులైనఁ ద
ప్పదుమరణంబటంచు నిఁక పర్వఁగ నేలయటంచు నిల్చుచుం
బ్రిదరములా రఘూత్తమునిపైఁ గురియింపఁ దొడంగిరందఱున్.

ఉ. క్రోధితులైన వైరులనకుంఠిత విక్రముఁడైన జానకీ
నాథుఁడు బిట్టదల్చి పలునారసముల్ నిగుడింప దుష్టదై
త్యాధమయూథమస్తకము లంఘ్రులుఁ జేతులుఁ గుప్పకుప్పలై
భూధరపంక్తినాఁ బడియె భూస్థలి నిర్జరులుబ్బి యార్వఁగన్. 227

క. అక్కదన ఘూమిఁ బవిచే
ఱెక్కలు మొదలంటఁగా విఱిఁగి గిరులవనిం
గ్రిక్కదలఁ జేయఁబడు క్రియ
రక్కసులొక కొందఱుర్వరం ద్రెళ్లుటయున్. 228

ఆ. నూఱువ్రయ్యలుగాఁగ మేనులుర మేశు
మార్గణంబుల వ్రిస్సియు మాయవన్ని
లేచినిల్వఁ దొడఁగిరి నిశాచరులొక
కొందఱాకృతు లత్యంత ఘోరములుగ. 229

క. శిరములు బాహువులును నం
బరమున కెగయంగఁ దొడఁగె బహుళంబుగ శీ
ర్షరహిత కబంధములు స
త్వరఁ బఱచుచునుండె నసులువట్టి శరములన్. 230

ఆ. కంకగృధ్రజంబు కంబులుఁ గాకము
లతికఘోరరవము లాచరించెఁ
బ్రేత భూతకోటి పృథుల పిశాచముల్
పునుక కర్పరములఁ బూనియాడె 231

తే. వీర బేతాళములు భయావేశ మొదవఁ
దాళములువేయ యోగినీ తతినటించె
రామచంద్రాశుగములు శిరములురములుఁ
గరములున్ రాలిచెఁ బ్రచండగతి భటులకు. 232

తే. ఐన నాయోధులంతట నవనిఁబడియుఁ
గ్రిమ్మరన్ లేచి రణమొనర్పం దివురుచుఁ
బట్టుఁడంచును నత్యంత భయదరవము
లాచరింపఁ దొడంగి రత్యద్భుతముగ 233

ఆ. ఆంత్రములను బట్టి యందందఁ బరువెత్తె
నరుపిశాచములు మహోగ్రగతిని
గ్రద్దలెల్ల వాని గ్రహియించి వినువీథి
కెగయుచుండె నధికమగు రయమున 234

క. గగనముననాడు గృధ్రము
లగణితముగఁ దోఁచుచుండె నాహవమునఁ ద
న్నగరమున బాలకావళి
మిగుల రతిఁ బతంగకేళి మెలఁగిరనంగన్. 235

క. ఈవిధమున రాక్షస భటు
లావై దేహీ మనోహరాంబర హేతులై
జీవములఁ బాయఁగని త్రిశి
రోవిబుధాహితుఁడునుం ఖరుఁడుదూషణుఁడున్. 236

క. పెనువగ కినుకయుఁ బెనగొన
నినకులవిభు శక్తితో మశేష పరశు శూ
లనిశిత కృపాణములనే
సినవవి నిముసమునఁ దునిమి శ్రీపతి పెలుచన్. 237

క. పదిపది యమ్ముల వారల
హృదయంబులు వగులనేయ నిలఁగూలియు దు
ర్మదులగు దానవయోధులు
కదనము సేసిరొగి లేచి క్రిమ్మరమాయన్. 238

క. ఘనమాయఁ బన్నిచావక
పెనగిరి పదునాల్గువేల ప్రేతలగుచు రా
మునితో నతఁడొక్కండని
మునులుం దివిజులును నుల్లముల భీతిలగన్ 239

క. కని మాయాపతి రాముఁడు
వినోదమొకటి యొనరించె విస్మయముగ న
ద్దనుజప్రేతల కొండొరు
లన ఘనుఁడగు రామునట్లు లగపడునటులన్. 24

తే. ఒకని నొక్కండు రాముఁడంచూహ చేసి
ద్వంద్వయుద్ధము సేసి మృదంబుడింద
మ్రింది రందఱు శ్రీరామ రామ రామ
యనుచుఁ గాపున నిర్వాణమ్ముఁ దిరపుడే. 24

ఒక్కక్షణములోనె నురుమాడె నీరీతిఁ
బెక్కు రుక్కుమీఱు రక్కసులను
నొక్కఁడయ్యు సతముముక్కంటి జపియించు
నక్కజంపు లక్ష్యమైన విభుఁడు. 242

పరమకృపాళుండీగతి
సురవైరులఁ దునుమ సురలు స్తుతిచేయుచు ని
ర్భర హర్షాంబుధిఁ దేలుచుఁ
గురియించిరి విరులు వాద్యఘోషము లెసఁగన్. 243

సకలరిపులు సీతానా
యకుఁడు జయించెనని మునులు నమరులును నర
ప్రకరమును విగతభయులై
రికరంబు విమానముల నరిగిరిసుపర్వుల్. 244

అంతలక్ష్మణుండు నవనిజా సహితుఁడై
వచ్చి రామచరణ వనరుహముల
కెఱఁగినంత నతని నెంతయుఁ బ్రీతితోఁ
గౌగలించుకొనియె ఖరవిరోధి. 245

శ్యామల కోమలగాత్రుని
ప్రేమంబునఁజూడఁ దొడఁగెఁ బృథివీసుతయి
ట్లామహితుఁడు సురమౌని
స్తోమహితచరిత్రి నడపె శుభపంచవటిన్. 246

## శూర్పణఖ తన పరాభవమును ఖరదూషణాది వధయును దశముఖున కెఱింగించుట

త్రిశిర ఖరదూషణ నిధన
దశఁ గనుఁగొని శూర్పణఖ సదైన్యవదనయై
దశముఖు పాలికిఁజని తన
దశయుం ఖరముఖ్యదనుజ ధశనిట్లు తెలిపెన్. 247

క. అతికుపితాత్మిక యగుచున్
మతిహీనుఁడవైతి వకట మఱచితె దేశ
స్థితియును గోశస్థితియును
సతతముఁ గలుద్రావి హాయిశయనింతువో కో 248

క. నీతలపై శత్రులుఁగల
రాతలఁ బంచుకయులే కహార్నిశలు సురం
బ్రీతింగ్రోలి శయించిన
ఖ్యాతియగునె రాజ్యతంత్ర గతియుంజెడదే. 249

ఆ. నీతిలేని రాజ్య నిర్వాహణంబు ధ
ర్మాతిరిక్తమౌ ధనార్జనంబు
శివ సమర్పణంబు సేయని సత్కర్మ
మతి వివేకమొసఁగ నట్టి విద్య. 250

తే. నిష్ఫలితములు శ్రమతాను వీనికిఫలంబు
సంగమునను యతియును రాజ్యము కుమంత్రి
మునను నభిమానమున జ్ఞానమును మఱియును
పానమునలజ్జ యువివయు పరతఁబ్రియము. 251

క. మదమున గుణియును వేగఁజె
డుదురని యెందును వినంబడును నీతికడున్
మది నల్పమని గణింపమిఁ
దుదిఁజేటగు వైరరుజల దుష్కృత ఫణులన్. 252

క. అని పలుభంగులఁ బలుకుచుఁ
గనలుచుఁ జీకాకుపడుచుఁ గడునడలుచు రో
దన మొనరించుచు సభ న
య్యనిమిషకంటకి వచించె నవనిఁబడి వెలన్. 253

క. జీవసమీహితంబులతో
నీవుండఁగ నాకు నీచ నిష్ఠురగతి యి
ట్లావహిలుటయే యనుచుం
గ్రావంబులు వగులగట్టిగా నేడ్చుటయున్. 254

తే. సభ్యులందఱు నదివిని సంభ్రమించి
వికలురై లేచి యద్దానవిని భుజముఁ
బట్టియెత్తిన దానిని బంక్తివదనుఁ
డరసి యంశముఁ దెలుపకే యడలెదేల. 255

క. నీనాసాకర్ణంబుల
నేనీచుఁడు గోసివైచె నెఱిఁగింపు మనం
దానవి వలికె నయోధ్యా
భూనాథుండగు దశరథ పుత్రులటవనిన్. 256

క. ఖేలనమునకై వచ్చిరి
బాలవయస్కులును బురుష పంచాననులు
ద్వేలాసుర విరహితముగ
భూలోకముఁజేయ బ్రితినఁబూనిరటంచున్ 257

క. వినియుంటిని తద్భుజబల
మున మును లభయులగుచు వనమునఁ జరియింపం
గనిరికన బాలురయ్యును
వనుపమధీరులును ధన్యులంతకసములున్. 258

క. అతులిత బలప్రతాపా
న్వితులిర్వురు సోదరులును విబుధమునీంద్ర
ప్రతతికి హితమొనరింపఁగ
హతమొనరించెదరు ఖలులనరసి వీరసులై. 259

క. అందగ్రజుండు రాముఁడ
నందగు నందమునకిక్క నలినాక్షీకడున్
సుందరి శ్యామ శరద్రా
కేందుముఖియునగుచు నతని యింతి చెలంగున్. 260

ఆ. రూపరాశిగాఁగ నాపయోజాసన
విధియొనర్చెఁ గోటివేలరతులు
సాటిరారు దానిసౌందర్య గరిమకు
వేయునేల యట్టి వెలఁది లేదు. 261

క. ఆ రాముని యనుజన్ముం
డీరసమున సీకు భగిని నేనని పరిహా
సారంభుండై బఱబఱ
నా రెండు చెవులును మఱియు నాసయుఁ గోసెన్. 262

తే. అంతనేఁబోయి ఖరదూషణాదులైన
రక్కసులఁబిల్వ వారలు రయముమీఱ
రామునిం దాకి రణమొనర్పంగ వారి
నదమదము సేసె నాతండు క్షణములోన. 263

క. అనిపలికిన ఖరదూషణు
లును ద్రిశిరము ఖామరారులును బొలిసిన వా
ర్తను విన దేహంబంతయుఁ
గనకనమునిమండెఁ బంక్తికంఠునకంతన్. 264

క. శూర్పణఖ ననునయించి స్వ
దర్పంబునుగూర్చి బహువిధములుగఁ దానే
యేర్పఱచి పలికి చింతయె
లర్పంగ దశముఖుఁడు నిజనిలయమున కరిగెన్. 265

క. చింతింపసాగె నీగతి
సుంతయు నిశనిద్రరాక సురనరదనుజుల్
జంతులు ఖగనాగాదు లొ
కింతయు మదనుచరులకును నెనగారుగదా 266

క. ఖరదూషణులన మత్సమ
పరాక్రిములు వారిఁ దునుమ భగవంతుఁడు ద
క్కొరులకు శక్యంబగునే
సురహిత మొనరింప శౌరి క్షోణి జనించెన్. 267

క. అవనీభారము మాన్పఁగ
నవతారమునొందెఁ బరముఁడటు గావున నే
నువిరోధంబొనరించి త
త్పవిమల శరహతినిజచ్చి తరియింతుబలే. 268

క. ఈతామస గుణదేహ
స్థితుఁడనై భజనసేయనేరను గానం
భూతలపతి సుతులగుచో
సీతన్ నిరువుర జయించి యింతిహరింతున్. 269

## రావణుండు మారీచుని గృహంబున కేగుట

క. అనితలఁచుచు నొక్కరుఁడే
చనియె విమానంబునెక్కి సాగరతీరం
బునఁగల మారీచుండను
దనుజునిపాలికి దశాస్య దానవుఁడంతన్. 270

తే. ఇచట శ్రీరామచంద్రుఁడదెట్టి యుక్తి
చేసెనో యామనోహర చిత్రచరిత
వినుము గిరిరాజకన్యకా యనుచు మిగులఁ
బ్రీతితోఁడవచించె నీరీతిమృడుఁడు 271

మ. ఫలమూలంబులు సంగ్రహించు పనిఁదీర్పన్ లక్ష్మణుండున్ వనం
బులకుంబోయినవేళ నవ్వుచుఁ గృపాంభోరాశి సౌఖ్యాకరుఁ
డలఘుండా రఘురామభూవిభుఁడు నిత్యానందుఁడా జానకీ
లలనారత్నముతోడ నిట్టులనియెన్ లాలిత్యవాక్చాతురిన్. 272

తే. ప్రేయసి సుశీల వినుము మత్ప్రియకరమగు
వ్రత మొకఁడు తెల్పువాఁడనే రాక్షసులను
సంహరించువఱకు నరసదృశలీల
సలిపెదనుగాన నీవుండు జ్వాలనునందు. 273

తే. అని ప్రభుండానతిచ్చినంతనె మహీజ
నిజహృదయమున విభుపదాంబుజ యుగంబు
నిలిపి వహ్నిఁ బ్రవేశించి కలితరూప
శీలముల సీతయేయనఁ బోలుదాని. 274

క. తనప్రతిబింబము వినయం
బుననొప్పెడు దాని నిజవిభునికడ నిలిపెన్
మనమున లక్ష్మణుఁడును నెఱుఁ
గనిగతి నిటుచేసెఁ బ్రభుఁడు కలితచరిత్రిన్. 275

తే. అధిక నీచుండు దుష్టుండు స్వార్థరతుఁడు
నైన రావణుఁడల్లన నరిగి సకల
మాయ లెఱిఁగిన మారీచు మామఁగాంచి
శిరములన్ వంచి నతిచేసి చేరనిలిచె. 276

తే. అంకుశధనుర్భిడా ఘోరగాలియట్లు
ఖలునినమ్రత మిగుల దుఃఖప్రదంబె
దుష్టుని ప్రియోక్తులును భయ కష్టదముల
కాలపుష్పంబులట్టుల శైలతనయ. 277

ఆదరంబున మారీచుఁ డసురవిభుని
పూజితుంజేసి యొంటినిప్పుడు మనంబు
వ్యగ్రితంజెంద నీవచ్చినట్టి హేతు
వేమి తెల్పుమనంగ వాఁడెల్లఁ దెలిపి. 278

ఓయీ నీవొక సుందర
మాయా మృగమగుచు నృపుని మానిని భ్రమయం
జేయుము నిను బట్టంగా
నాయవనిపుఁడరుగ నతని యతివహరింతున్. 279

అనుడు మారీచుఁ డనియెనో యసురనాథ
యతఁడు నరరూప మొందియున్నట్టి సకల
జంగమ స్థావరములకు స్వామిసుమ్మి
యతని తోడ విరోధింప నగునుహాని 280

సకలలోకాళిఁ గల జీవసంఘములను
జంపబ్రదికింప నాతఁడే సర్వశక్తి
ధరుఁడు మున్నీకుమారులు తపసియజ్ఞ
రక్షణము సేయవచ్చి దోర్బలమెసంగ. 281

మొనలేని యొక్క బాణం
బున ననునేయంగ వేగమున క్షణమున యో
జనశత దూరంబునఁ బడి
తిని వైరము కూడదట్టి ధీరునితోడన్. 28

భ్రమర కీటంబురీతిఁ దద్భ్రాతృయాగము
నెల్లెడంగాంతు నుల్లంబు జల్లనంగ
మనుజులేమైన నతిశౌర్య మహితులగుట
వారికి విరోధులై మనువారు లేరు. 283

క. అతఁడె సుబాహునిఁ దాటక
హతమార్చె ననన్య సాధ్యమగు శివచాపం
బతి సుకరంబుగ విఱిచెన్
వితత బలుల ఖరముఖాగ్రవీరులఁద్రుంచెన్. 284

తే. మానవుండైనచో నంత మహితబలము
దెక్కడిది నీకుల క్షేమ మెంచెదేని
భవనమున కేగు మనవుడు భగ్గుమనుచు
మండిపడి తిట్టుచుం బొలదిండిఱేఁడు. 285

శా. ఓరీ మూర్ఖుఁడ బోధచేసెదవె నాకాచార్యునింబోలె నీ
వోరెట్లాడిన నట్లు మామక సమానుండైన వీరోత్తముం
డీరేడైన జగంబులం గలఁడె నీవెందైనఁ గన్గొంటివే
కారుల్ ప్రేలెదవేల యంచదలుపం గావించు మారీచుఁడున్ 286

ఆ. శస్త్రధారిమర్మి శఠులతోఁ బ్రభునితో
ధనికుతోడ వంది జనునితోడ
వైద్యకవులతోడ వరగుణవంతుతోఁ
గలహపడుట మేలుగాదటంచు. 287

క. మతిఁదలఁచి యుభయవిధముల
హతమగుటయె నిక్కమనుచు నతిదుష్టునితోఁ
బ్రతివచనము లాడినఁ దన
శితఖడ్గముతోడ నఱకు సిద్ధమటంచున్. 288

క. రాముని వరశరహతిచే
నీమేను త్యజింప నాకు నెంతయు సుఖమా
ధామము దొరకునని పరం
ధాముని శరణంబు వేఁడె దశవదనునితోన్. 289

## మారీచుఁడు రావణ సహితుఁడై దండకాటవికేగి లేడియగుట

తే. చనియె శ్రీరామచంద్రుని చరణకమల
భక్తి యవిరతమైయొప్ప భావమందు
నత్యధిక హర్షమొందుచునది దశాస్య
దివిజవైరికి నిసుమంత తెలియనీక. 290

క. పరమస్నేహనిధానముఁ
జిరతర సౌఖ్యపదసీమ శ్రీరాముని నే
డరసెద నేనని యుబ్బుచు
నరిగెన్ మారీచుఁ డాదశాననుతోడన్. 291

తే. మామకప్రియుఁడైన శ్రీరామచంద్రుఁ
గనులఁ గాంచి సుఖించెదఁ గమలతోడ
లక్ష్మణునితోడఁ దగు కృపాలయుని చరణ
నలినముల మన్మనంబు లగ్నంబొనర్తు. 292

తే. ఎవని క్రోధంబు మోక్షంబు నీయఁ గలదొ
యేవిభుఁడు భక్తికిన్ వశుఁడై వెలయునొ
యట్టి సుఖసాగరుఁడు హరిహస్తమునను
నమ్ము సంధించినను దునుమాడుఁ గాక. 293

ఆ. పట్టఁ దలఁచినన్నుఁ బరువెత్తి వెనువెంట
విల్లునమ్ములూని వేగవచ్చు
ప్రభుని దిరిగితిరిగి పరికింపఁ గల్గుదు
నన్నుఁబోలు ధన్యుఁడెన్న నెవఁడు. 294

క. అని యాలోచన సేయుచుఁ
జనుచుండఁగ నచట రామచంద్రుఁడు గలఁడ
వ్వనముండాసె దశాననుఁ
డనుపమ మాయాకురంగమయ్యె నతండున్. 295

క. పసిమిగల పసిఁడిఁ దెగడుచు
నసదృశ దీధితుల నీనుసంగము కడునిం
పొసఁగు మణిఖచితమన సొం
పెసఁగఁగ వర్ణింపరాక యిట్టిచెలంచెన్. 296

ఆ. అట్టి లేడిఁగాంచి యద్దానిప్రిత్యంగ
సౌష్ఠవంబునరసి చాలమెచ్చి
రాముతోడ ననియె భూమిజ కరుణాబ్ధి
కనుమదెంత మంచి కనక మృగము. 297

ఆ. దాని చర్మమెంత తళతళ లాడుచు
మెఱయుచుండె నట్టి మృగకళాస
మభిలషింతుఁగాన నధిప సత్యధురీణ
యిట్టిఁ గొట్టి తెచ్చి యిమ్మనంగ. 298

క. సర్వజ్ఞుఁడైన విభుఁడు సు
పర్వానీక హిత కార్యపర తంత్రక్రియా
ధూర్వహుఁడై హర్షంబున
మౌర్వింజాపమునఁ దగనమర్చి రయమునన్. 299

చ. కటిబిగియించికట్టి మృగకైతవ పోతముఁగాంచి విల్లునం
బటుతర బాణముందొడిగి భ్రాతఁగనుంగొని రాక్షసాళియి
య్యటవిఁ జరించుచుండు సమయంబున బుద్ధిబలంబుగల్గి బల్
డిటవునఁ దెల్వితోడుత విదేహనృపాత్మజఁ గాచుచుండుమా. 300

క. అని బోధించుచుఁ దనుగని
కనకమృగము పర్విడంగఁ గ్రిన్నన వెంటం
జనెఁ బరువెత్తుచు గమనం
బు నగమనము లేనియట్టిపోడ్రిడ గిరిసుతా. 301

ఆ. నేతినేతియనుచు నిగమంబులెవ్వని
నిర్ణయించు నెవ్వనిన్ శివుండు
ధ్యానమునను బొందఁదలఁచు నాపెన్నిధి
లేడి వెంటఁబడియెఁ జూడుమనుచు. 302

ఆ. గరుడుతోడఁ బలికెఁగాగ భుశుండియు
నీశ్వరుండటంచు నిందుమౌళి
యగజ కానతిచ్చెనని భరద్వాజుతో
యాజ్ఞవల్క్యుఁడనియె హర్షమెసఁగ. 303

వనమయూరము :- చెంగటమెలంగును దొలంగి చనుదవ్వై
నింగినొరయంగఁ బలుభంగులఁ గురంగం
బంగము పిసాళిరుచులం గలుగఁ జేయం
జెంగునను దాటుచు మఱుంగుపడుఁ దోఁచున్. 304

తే. ఈవిధంబునఁ దోఁచుచు నిట్టె మఱుఁగు
పడుచుఁ గపటకురంగంబు ప్రభునిఁ గొంత
దవ్వుగొనిపోవ విసువొంది దాని నొక్క
శరమునం గొట్టె శ్రీరామచంద్ర విభుఁడు. 305

## సీతాదేవి ప్రేరణచే లక్ష్మణుఁడు రామసన్నిధి కేగుట.

క. హా లక్ష్మణాయనుచు మహిఁ
గూలుచు స్మరియించె నిఖిలగురు రామవిభున్
మేలెఱిఁగి స్వస్వరూపము
దాలిచి మారీచుఁడంతఁ దనువు త్యజించెన్. 306

క. అంతర్భక్తిం గనుఁగొని
యంతర్యామి యగు రాముఁడాతనికి మహా
శాంతులగు మునులకందని
సంతోష స్థానమొసఁగె శాశ్వతగతిగన్. 307

తే. దీనబంధుం డసురునకు దివ్యమైన
నిజపదంబీయ హర్షించి నిర్జరాళి
వితత సుమవృష్టిఁ గురియించి విమలగుణ క
థలను బాడుచుఁ గొనియాడె దాశరథిని. 308

తే. రక్కసునిఁ జంపి వెంటనే రామవిభుఁడు
గటినిషంగంబుఁ జాపంబుఁ గరమునందు
శోభిలంగ మరలె నిటక్షోణితనయ
యార్తనాదంబు నాలించి యతిభయమున. 309

తే. లక్ష్మణా వేగఁజనుము కొలందికాని
సంకటమునొందె మాయన్న సాయపడుమ
నంగ నవ్వుచు నతఁడు జననిరో యెవని
భ్రూవిలాసంబునన్ సృష్టి భువనలయము. 310

క. కలుగుచునుండునొ యాతం
డలఘుఁడు శ్రీరామచంద్రుఁ డతనికి హానుల్
కలనైన సంభవించునె
కలఁగంబని లేదనంగఁ గడునిష్ఠురముల్. 311

క. పలుక హరి ప్రేరణమునఁ
జలిత హృదయుఁడగుచు రామచంద్రానుజుఁడ
వ్వెలఁదిన్ వనదిగ్దేవా
దులకెల్లర కప్పగించి తోడనె తానున్. 312

తే. రావణ నిశాకరునకు గ్రహరాహువైన
రామచంద్రుఁ డరిగిన మార్గంబుఁ బట్టి
చనుచునుండంగ నిదియంచి సమయమనుచు
రావణుఁడు సర్వలోక భయావహుండు. 31

## రావణుఁడు సీత నపహరించి కొనిపోవుట.

క. యతివేషమున సమీప
క్షితి నటునిటుఁ గుక్కవోలెఁ జెరలాడుచు దు
ర్గతి నడచుచుండె వానికి
మతియుఁ దనుద్యుతియు నెంతమాత్రి మొదవునే 314

క. అని కాగభుశుండి ఖగేం
ద్రునితోన నెనట్లు దుర్మదుండగు మాయా
మునియేగి పర్ణశాలం
గనుఁగొనియెన్ సీత నరుణకర నతిభీతన్. 315

ఆ. కని యనేకమైన కథలును రాజనీ
తియును బ్రీతి భయముఁ దెలియఁ జేయ
సీత కాంచి దుష్టరీతి వచించె దే
మయ్య యతివరేణ్య యనుచునడుగ. 316

క. నిజరూపముఁ జూపుచుఁ దన
భుజబలముం దెలిపి నామముం బేర్కొనఁగం
గజగజవడఁకి భయంబున
గజగామిని గాఢస్థైర్యగరిమం గనుచున్. 317

శా. ఓరీ దుష్టుఁడ యేలజల్పములు నీవొక్కింత సేపిచ్చటం
ధీరత్వంబున నుండెదేని విభుఁడే తేరంగలాఁ డప్పుడీ
బీరంబుం గనవచ్చు సింహరమణిం బేరాసచే జంబుకం
బేరీతిం గొనసెంచి మ్రింగునటులో హీనాత్మరక్షోధిపా. 318

శా. నీవుంగాలవశుండవేట హితమున్ వీక్షింపకే యన్నిటుల్
భావంబందునఁ గోరుచుంటివన నాపల్కుల్ వినంగానె య
ద్దేవారాతివరుండు హ్రీకలితుఁడై దివ్యంబులౌ నంఘ్రిరా
జీవంబుల్ మది నెంచి మ్రొక్కి సుఖముం జెందెం గడుం బ్రీతుఁడై

స్రగ్ధర: క్రోధుండై రావణుండా కువలయ నయనం
గుంభినీపుత్రిఁ గొంచుం
బాధోదవ్రాత వీధిం బ్రజవరథముపై
బల్మిమైఁ బెట్టిపోవన్
నాథా శ్రీరామచంద్రా నతజనవరదా
నన్ను రక్షింపవేలా
బోధానందస్వరూపా భువనపతి ననుం
బ్రోవనిం కెవ్వరంచున్. 320

ఉ. హేజగదేకవీర నిఖిలావన పావననామ రామ యీ
యోజ దయావిహీనమతి నొప్పరికింపఁగ సాపరాధనే
భూజను లెల్లనిన్ శరణుబొందిన సౌఖ్యముసంగు వాఁడవే
హేజలజాప్తవంశ దివసాధిప నామొఱనాలకింపవే. 321

ఉ. హేరణధీరలక్ష్మణ రవంతయుదోసము లేని నిన్ను నే
నేరమినెగ్గులాడితిని నిన్ననిటట్టి ఫలంబుఁ గాంచితిం
గ్రూరనిశాచరాపహృత ఘోరవిపద్దశఁ గుందునే నిదే
చీరెదరాగదే కరుణచే విడిపింపఁగదే రయమ్మునన్. 322

మ. కరుణాసారమపారమై వెలయు మత్కాంతాంతరంగంబునం
బరమస్నేహియమైన దూరగుఁడు నాపాటెట్టులంగాంచు నే
డరరే నిర్జరయోగ్యమై తగుపురోడాశంబు నాశించెఁగా
కరమున్ నీచతనొప్పు రాసభము దుఃఖంబెట్లు సైతున్ విధీ 323

క. నాపాటు విభునికోడఁ గ్రూ
పాపరులై యెవ్వరెఱుఁగఁ బలుకుదురని చిం
తాపరమై వందురు నా
భూపుత్రికఁ గాంచిపొగిలె భూతములెల్లన్. 324

## జటాయువు రావణునితో యుద్ధముసేసి నేలంగూలుట.

క. ఆయార్తధ్వని విని రఘు
నాయకు దేవిగఁ గ్రహించి నడగొండ యనం
గాయము దోఁపఁగ నపుడు జ
టాయువు చింతించెఁ దనయెడఁద నీరీతిన్. 325

క. రఘుకులతిలకుని దేవి న
లఘుశీల హరించె నీపొలసుదిండి శఠుం
డఘుమతి మ్లేచ్ఛుండు కపిల
దుఘఁ గొనిపోయెడు విధమున దోసంబకటా. 326

క. అని తలఁచి వెఱవకమ్మా
యినకులపతి దేవి సీత యీదుష్టుని మ
త్సునిశిత చంచుపుటంబునఁ
దునిమి నినున్ విడువఁజేయుదున్ మత్ప్రతిజ్ఞ. 327

క. అనిపలుకుచు గిరిపైకిం
జను కులిశమువోలెఁ బక్షజనితానిలుచే
వనభూజంబులు ద్రెళ్ళఁగ
వినువీధికి నెగసి దైత్యవీరుం దాకెన్. 328

క. ఓరీ నన్నెఱుఁగవె దు
ష్టారంభుఁడ నిలువవనుచు నదలించుచు దు
ర్వారకృతాంతుం డోయనఁ
గారయమున వచ్చునా ఖగప్రభుఁ గనుచున్. 329

తే. మరలి దశకంధరుఁడు తనమానసమునఁ
దలఁచె నీతఁడు మైనాక ధరణిధరుఁడొ
వైనతేయుండొ సహరియై వచ్చెనేని
నా బలపరాక్రమములఁ గనంగలఁడు 330

క. ఆ యయూహించితి జరఠ జ
టాయువితఁడు వీనికింక నాయువుమూడెన్
నాయురు కరతీర్థంబునఁ
జేయుదురానిమ్ము తగినశిక్ష యితనికిన్. 331

చ. అని తలపోయుచుండు దనుజాధిపుఁ గన్గొని క్రోధమూర్తియై
యనియెజటాయువోరి కలుషాత్మక రావణ నాదుసూక్తులన్
విని జనకాత్మజన్ విడిచి వేచనుమింటికి లేనిచో నినుం
దునిమి దహించు రామశరదుస్సహవహ్ని సబాంధవంబుగన్ 332

చ. అనవిని మాఱువల్కని దశానన వీరునిఁగాంచి క్రుద్ధుఁడై
పెనుసిగవట్టి యీడ్చివడి పృథ్వీపయిం బడఁగొట్టి తోడనే
జనకజనొక్కచోటనిడి చంచుపుటంబున వానిగాత్రముం
దునుకలుగాఁగఁ జీఱఁగడు దుర్భరమూర్ఛ మునింగెనాతఁడున్.

ఉ. అంతటఁ దేఱివాఁడుఁ బ్రళయాంతకుఁ డోయనమండి తీవ్రదు
ర్దాంతకరాళఖడ్గమునఁ దత్క్షణమాతని పక్షయుగ్మము
త్యంతబలంబునందునుమ నద్భుతవిక్రముఁ డాజటాయువుం
గొంతరణంబొనర్చి మహిఁగూలె రమాపతి సంస్మరించుచున్ 334

ఉ. రావణుఁడంతఁ దేఱిపయిఁ గ్రన్నన జానకిఁ దెచ్చియుంచియ
ద్దేవివిలాపమున్ సలుపఁదీవ్ర రయంబున నుప్పరంబునం
బోవుచునుండె నిర్భయతబోయకుఁ జిక్కినయాఁడు లేడినా
నావరవర్ణినీమణి భయంబునఁ గంపమునొందె నత్తఱిన్. 335

క. కొండఱు కపులొక భూధర
మందుండఁగఁ గాంచి సీతహారిఁ బేర్కొనుచుం
గుందుచుఁ జేలమువారల
ముందఱఁ బడవైచె గగనముననుండి వెసన్. 336

## రావణుఁడు లంకకేగి సీత నశోకవనమున నుంచుట.

క. ఈవిధమున శ్రీరాముని
దేవేరిం గొంచు నేగి దితిజాధిపుఁడా
రావణుఁ డశోకవనమున
నా వెలఁదిని డించి పెక్కులైన ప్రియములన్. 337

తే. పలికి వెఱపించి సుంతయు ఫలము లేమి
యత్నమొనరింపఁ గొందఱు యాతుధాన
సతుల నతుల భయంకరాస్యలను బంచి
ఖలుఁడగు నతం డశోక వృక్షంబు క్రింద. 338

ఆ. సీత నుంచి చనియె శ్రీరామచంద్రుని
మాయ లేడిఁ దఱుము సోయగంబుఁ
దలఁచికొనుచు సంతతంబును దన్నామ
జపము సేయుచుండె జనకతనయ. 339

## రామలక్ష్మణు లొండొరులఁ గలిసికొనుట.

తే. అంతనచ్చట శ్రీరాముఁ డనుజుఁ డతని
కెదురుగా వచ్చుటం గని యెక్కుడైన
చింతఁ బైకి వహించుచు సీత నొంటి
విడిచి వచ్చితె నా మాట గడచి వత్స. 340

క. దనుజని కాయము మెండుగ
వనమునఁ దిరుగాడుచుండు వత్స వినుము నా
మనమునఁ దోఁచుచునున్నది
జనకాత్మజ లేదు పర్ణశాల నటంచున్. 341

క. అను పలుకుల విని ప్రభుపద
వనజంబుల వ్రాలి హస్తవారిజయుగ్మం
బును మోడ్చి లక్ష్మణుండి
ట్లనె నా దోసంబు లేద యవధారు విభూ. 342

క. అనననుజ సహితుఁడగుచుం
జని గోదావరిదరిని నెసఁగు నాశ్రమమం
దున జనకజ లేకుండుటఁ
గని సాధారణ మనుజుని కైవడినడలెన్. 343

## శ్రీరామచంద్రుఁడు సీతను బర్ణశాలం గానక విలపించుట.

క. హా జానకి సుగుణ ఖనీ
నైజవ్రత నియమశీల నయహిత సీతా
తేజోరూప పునీతా
రాజీవముఖి శిరోగ్రరత్న స్ఫీతా. 344

క. అని యడలెడు నగ్రజునిం
గనుఁగొని సౌమిత్రి పెక్కుగతులం బోధిం
చిన వనవృక్ష లతాదుల
జనకజ యేదనుచు రామచంద్రుఁ డడుగుచున్. 345

ఆ. నడువఁదొడఁగె హరిణనయనను గంటిరే
ఖగములార వన్యమృగములార
షట్పదంబులార సరసీరుహములార
యరసితిరె శరత్సుధాకరాస్య. 346

సీ. ఖంజరీటములు శుకములుఁ గపోతముల్
మృగములు మధుపాళి మీనములును
పికములు కుందముల్ బిసరుహంబులు దాడి
మీఫలంబులు నునుమించు తీవ
శరదిందు బింబంబు నురగకా మినులును
వరుణపాశంబును మరునిధనువు
హంసలు గజములు హర్యక్షములు లతల్
కనకంబు కదళికా కాండములును

ఆ. ఇట్టి నీనియార్ష్య నెట్లు సహించెద
వేల వేగరావ దెచటనుంటి
వే ప్రియా యటంచు వెదకుచుదురిపిల్లె
నధిక కామివిరహియనఁగ విభుఁడు 348

తే. పూర్ణకాముండు సుఖరాశి భువనభర్త
భవవినాశ విహీనుండు భద్రనిలయుఁ
డయ్యు నీలీల నరలీల నాచరించెఁ
జిత్రములుగావె శ్రీహరి చేష్టితములు. 349

## రామలక్ష్మణులు ధరణిం బడియున్న జటాయువుం గాంచుట.

తే. ఈవిధంబునఁ గొంతదవ్వేగి యెదుటఁ
గొండయోయన భూస్థలిఁగూలి రామ
చరణ సరసీరుహద్వయ స్మరణసేయు
గృధ్రపతిఁగాంచె దనుజగిరీంద్రవజ్రి. 350

తే. కరసరోజంబునం దనశిరమునంటు
రామవిభు సుఖసౌందర్య సీమయైన
వికచ కమలాననముఁగాంచి విగతపీడ
నలరెను జటాయువత్యంత హర్షమెసఁగ. 351

తే. ధైర్యమువహించి యపుడు గృధ్రపతివలికె
నో భవభయాపహారి సర్వోపకారి
దశముఖునిచేత నాకు నీదశలభించె
వాఁడెకొనిపోయె సీతఁ బావన సుచరిత. 352

చ. ధరణికుమారిఁ దేరనిడి దక్షిణదిక్కునకుం దశాననుం
డరిగె మహాజవంబెసఁగ నంబరమార్గమునన్ మహీజయుం
గరుణముగాఁగ నశ్రువులుగాఱ విలాపమొనర్చె దీనయై
కరరికిరియన్ రఘుప్రవర ఘోరనిశాటతమః ప్రభాకరా. 353

క. నీదర్శనంబు కొఱకై
యీ దేహమునందు నుసురు లేనిలిపితినిం
కోదీనదయానిధి యా
ప్లోవంబునఁ బోవఁ దివిరె నసువులనంగన్. 354

ఆ. తండ్రి నిలుపుకొనుము తనువని శ్రీరాముఁ
డనఁగ విని ముఖమున హాసమెసఁగ
ననియె నెవనినామ మవసానకాలంబు
నందు నోటవెడలు నట్టిజనులు. 355

తే. అధములైనను మోక్షంబు నందఁగలర
టంచుఁ బలుకును వేదంబులట్టి విభుఁడు
నట్టి పరమాత్మ నాకిపు డక్షిగోచ
రంబుగాఁ జొచ్చెనిం కేఫలంబుఁగోరి. 356

ఆ. ఎంతవఱకు నిలుపు దీశరీరంబునఁ
గనుల నీరునించి యనియె విభుఁడు
తండ్రి నిశ్చయముగ తావక సుకృతమే
సద్గతిని నొసంగఁ జాలెనీకు. 357

క. పరహిత రతమతి యుతులకు
నరయఁగ దుర్లభముగలదె యఖిలజగములం
బరిపూర్ణ కాముఁడవు గద
వరమేమిచ్చెదను నీకు వరపుణ్యనిధీ. 358

క. తనువు త్యజించి మదీయం
బగు సుఖదమునైన ధామముం జేరుము మ
జ్జనకుఁడగు దశరథునితో
ననకుము సీతాపహరణ మైనవిధంబున్. 359

తే. నేనరాముఁ డనైనచో నిజకులాన్వి
తముగ దశకంధరుఁ డెవచ్చి తండ్రితోడఁ
దెలుపఁ గలవాఁడు సర్వంబుఁ దేటపడఁగ
నని జటాయువుతో విభుఁడానతీయ. 360

క. తనువున్ విడిచి జటాయువు
వనజాక్షుని రూప మొందె వరభూషణముల్
నును బచ్చ పట్టుపుట్టం
బును శ్యామాంగంబు నాల్గుభుజములు దనరన్. 361

క. ఈవిధమున హరిరూపము
నావిహగశ్రేష్ఠుఁ డొంది యానందాశ్రు
ప్లావితనయనాబ్జుండై
వేవిధముల రామచంద్రు వినుతించె నిటుల్. 362

## జటాయువు శ్రీరాముని స్తుతించుట.

సీ. జయ రామరూప నిస్సమ గుణాగుణ గుణ
పేరక దశముఖ పృథులబాహు
ఖండన చండాశుగ పరిమండితకర
సరసీజ నీరద శ్యామగాత్ర
భూలోకభూషణ ఫుల్లాంబుజానన
పంకేరుహాయతస్ఫారనయన
జగదేకవీర విజ్ఞానమయాకార
నిర్వికార విమోఘ నికరదూర

తే. అతులబాహు విశాల కృపాలవాల
భవభయనివార వేదాంత పథవిహార
శాశ్వతానంద కంద నిశ్చలముకుంద
నిత్యమున్ మొక్కి సేవింతు నిన్ను నంత. 363

తే. అపరిమేయ బలాది మధ్యాంతరహిత
మజమగోచరమవ్యక్త మతులమేక
మింద్రియాతీత మమల నిస్తంద్రతేజ
మఖిల భూధూర్వహము ద్వంద్వహరణమగుచు. 364

తే. తేజరిల్లు ననంత నీదివ్యనామ
మంత్రజపపర సజ్జన మానసాబ్జ
రంజనుండవు నిష్కామ రాగహీన
జనహితుండవు గోవింద సంగదూర 365

క. కామాది ఖల విభంజన
రామా రాజీవ నయన రవికుల సోమా
నేమంబొప్ప సతమునీ
నామము జపియింతు నిన్నె నమ్మి భజింతున్. 366

సీ. ఎవని నిరంజనుం డవినాశి బ్రహ్మము
జుండు వ్యాపకుఁడు విశుద్ధుఁడనుచు
వేదముల్ గొనియాడు విజ్ఞులైన మునీంద్రు
లెవ్వని జ్ఞాన నిరీహాభక్తి
యోగవైరాగ్య సంయుక్తులై పొందెద
రాకరుణాకంద మఖిలభువన
మోహనసుందరమూర్తి శ్రీరాముండు
పత్రికుమయ్యె శోభాపరిపూరి

తే. తాంగభవకోటి సదృశ శుభాంగుఁడై చె
లంగు నవ్విభుఁడెప్పుడు నభంగగతిన
సంగరతినిడి నాయంతరంగ వనజ
భృంగమగుఁ గాక కరుణాతరంగుఁ డగుచు. 367

సీ. అగముండు సుగముండు నమల స్వభావుండు
నసముండు సముఁడు సర్వాధిపుండు
సతతంబు యత్నంబు సలిపి వశీకృతేం
ద్రియమానసులు యోగిధీరవర్యు
లందంగఁ దగిన మహానంద విజ్ఞాన
సత్స్వరూపుఁడు సుధాశైత్యకరుఁడు
రామచంద్రుఁడు రమారమణీ నివాసుండు
త్రిజగద్విభుఁడు భక్తసుజనవశుఁడు

తే. సవనిపావనయశముఁ గీర్తించినంత
సంసృతి భయంబులన్నియు సమసిపోవు
నానిధానంబు నాహృదయాంబు జమున
ననవరతమును నివసించి యలరుఁగాక. 368

క. అని స్తుతియించి జటాయువు
తన కవిరళ భక్తినొసఁగ ధరణీజా నా
ధుని వరము వేఁడి వేంచే
సెను హరిధామంబునకు విశేష విభవుఁడై. 369

## శ్రీరాముఁడు జటాయువునకు దహనాదిక్రియలొనరించుట

తే. అతనికి యథోచితక్రియ లాచరించె
రామచంద్ర విభుఁడు స్వకరములతోడ
నధిక కోమలచిత్తుఁ డత్యంతదీన
వత్సలుఁ డకారణ కృపాస్వభావుఁ డగుట 370

ఆ. అధమ జాతియైన యామిషఖాదియౌ
పక్షియైన విమల భక్తినరసి
పరమ యోగివరులు ప్రార్థింపఁ గోరెడి
పదము నొసఁగె రామభద్ర విభుఁడు. 371

క. విను మవనీధర తనయా
జను లెవ్వారు విషయ భోగసక్తులగుచు రా
ముని గొల్వరో వారు జగం
బున నతిదౌర్భాగ్యులనఁగఁ బోలుదురు సుమా. 372

క. అనియె శివుఁ డని భరద్వా
జునితోఁ బరతత్త్వమార్గ సూత్రవిదుండౌ
మునివరుఁడు యాజ్ఞవల్క్యుఁడు
వినిపించుచు నవలిగాథ వినుమని పలికెన్. 373

## కబంధ వధ.

క. తదనంతరంబు రాముఁడు
దదనుజుఁడున్ వనములందు ధాత్రీపుత్రిన్
వెదకికొనుచుఁ జనుచుండఁగఁ
బొదలు లతాతతులు వివిధ భూమీరుహముల్. 374

క. దంతావళి పంచాస్యశ
కుంత మృగాదులును గలుగు ఘోరమహార
ణ్యాంతరమందుఁ గబంధున్
వింత దనుజునొకని రామవిభుఁడు వధించెన్. 375

క. అంతటవాఁడు నిజవపుః
కాంతులు దిశలావరింప గంధర్వుండై
సంతోషంబునఁ దనవృ
త్తాంతము నెఱిఁగించె నివ్విధంబునఁ బ్రభుతోన్. 376

క. దేవా దూర్వాసునిచే
నీ వికృతాకార మొంద నేనవు శాపం
బావహిలె భవత్పదరా
జీవంబులఁ గనుట నావృజినము నశించెన్. 377

క. అనవుడు గంధర్వునితో
ననియెన్ శ్రీరామచంద్రుఁ డవనీసుర స
జ్జన నివహద్రోహులు నా
మనమునకుం బ్రియులుగారు మఱియున్ వినుమా 378

క. త్రికరణ శుద్ధిగ భూసుర
నికరమునకు సేవచేయు నిపుణులవశతన్
సకల సురప్రకర పురాం
తక కమలజ యుతముగా సతము నేనుందున్. 379

తే. సజ్జనులు వల్కుచుందురు క్ష్మావిబుధులు
శాప మొసఁగినఁ గొట్టిన శాంతముడిగి
పరుష వాక్యంబు లాడినప్పటికి శీల
సుగుణ హీనులయినను బూజ్యులెయటంచు. 380

క. జ్ఞానియుఁ జతురుఁడు సద్గుణి
యైనను శూద్రుండు భూసురాన్వయ భవున
జ్ఞానే పూజ్యుం డనుచున్
వానికి నిజధర్మమెఱుఁగ వచియించి కృపన్. 38

తే. నిజపద ప్రీతియును నాతనికి మనమునఁ
గలుగుటం గాంచి మెచ్చె నాఖరవిదారి
ప్రభుచరణ కమలములకుఁ బ్రణతుఁడగుచు
గగనమున వాఁడు సనె నిజగతివడయుచు. 382

క. ఈగతి నాగంధర్వున
కాగుణనిధి గతినొసంగి యనుజసహితుఁడై
యేగె శబరి వసియించు ల
తాగమయుతమౌ మనోహరాశ్రమమునకున్.

## శబరి రామలక్ష్మణులఁ బూజించుట.

ఆ. శబరి రాము నాత్మసదనాగతునిఁ గాంచి
మదికిఁ బ్రియమొసంగు మానినుడులఁ
దలఁచి పద్మనేత్రు సలలితాయతబాహు
జటిల ముకుటు మృదుల జలదగాత్రు. 384

క. జ్వాల వనమాలా వక్షుం
గలిత కృపాదక్షు నసురగజ హర్యక్షున్
విలసిత మృదుగౌరాంగున్
ఖరవైరిన్ లక్ష్మణుని సకల విభుసంగున్. 385

క. కనిదండవత్ప్రణామం
బొనరించెఁ దదీయ భ్రాతృయుగ పావన ప
ద్వనజములకుఁ గడు ప్రేమం
బునఁ బలుకఁగ లేక మౌనమున మఱిమఱియున్. 386

ఆ. పాదపద్మములకుఁ బ్రణమిల్లి ప్రణమిల్లి
స్వచ్ఛజలముఁ దెచ్చి చరణములను
సాదరమునఁ గడిగి యాసనం బర్పించి
కూరుచుండఁ జేసి కుతుకమలర. 387

క. ఫలమూలంబుల నొసఁగిన
జలజాప్త కులప్రభుండు సప్రియమునఁ ద
త్ఫలమూలరుచులఁ బొగడుచు
నలరుచు భుజియించె శబరి యానందింపన్. 388

క. కరయుగ్మంబును మోడ్చి శ
బరి రాముని యెదుర నిలిచె బహుళంబై ప్రే
మరసంబు పొంగఁ గాన
ప్పరమాత్మునిఁ జూచి భక్తిపరవశయగుచున్. 389

నేనధమజాతి నతివడ
నైనను మతింగలుగు దాన నచ్యుత నిన్నున్
మానేందు ప్రియులుఁ గాఁ దగు
జ్ఞానానంద స్వరూపశక్యమె పొగడన్. 390

అధమాధ మాధమంబగు
వధూనికరమందు నికృష్టవంబుగనే న
త్యధమమగు మందబుద్ధిని
బుధనుత చారిత్ర పాపపుంజలవిత్రా. 391

అనుటయు రాఘురాముం డి
ట్లనియెఁ భామిని వినుము జనావళికిన్ నె
మ్మనములఁ గల భక్తియెనా
కనుపమ సంబంధమగుచు నలరారుఁ జుమీ 392

కులగౌరవ ధనపరి జన
బల ధర్మ సుగుణయుతులును బౌధులునైరా
జిలు జనులైన నభక్తులు
జల విరహిత మేఘ బృంద సదృశులుగారే. 393

## శ్రీరాముఁడు శబరికి నవవిధ భక్తుల ప్రకారం బెఱింగించుట

నవవిధ భక్తులఁ దెలిపెద
నవధానముతోడ వినుమ యాద్యము సుజన
ప్రవిమల సంగంబిఁక రెం
డవ దస్మత్కథలపై దృఢప్రీతి సుమీ. 394

విను తృతీయంబు గురుపాద వనజసేవ
స్వాభిమాన రహితత నిత్యంబుసేత
కపట హీనత మద్గుణ గానమాచ
రించుటయె నాలుగవదియై మించుభక్తి. 395

క. పంచమ మగు భక్తిన్ వివ
రించున్ వేదములు నన్ను దృఢ విశ్వాసం
బుంచి భజియించు చెపుడు జ
పించుచు మంత్రంబు నుల్లసించుట యనుచున్. 396

క. శమ దమములు శీలంబు ని
యమమును విషయాన్యకర్మ మనవరత విరా
గమును గలిగి సజ్జన ధ
ర్మము విడువమి యారవది సుమా వినుమబలా. 397

క. నియతిన్ సమబుద్ధి జగ
న్మయునిగ ననుగాంచుటయును మానసమున ని
శ్చయముగ నాకంటె నధిక
లయిన జనుల్ సాధులనుట యది సప్తమమా. 398

క. వినుమిక యదృచ్ఛాలాభం
బున సంతసమొందు స్వప్నమున నైన మనం
బునఁ బరదోషము లెన్నక
మనుటయె యష్టమపు భక్తిమార్గం బబలా. 399

తే. సరళభావంబు సతతము నిశ్చలత నుంట
నా యెడల నె సంపూర్ణ మా నమ్మకంబు
హర్షశోకంబు లెదను నందకుంట
నవమ మగు భక్తికిని లక్షణంబు లతివ. 400

క. ఈ నవవిధ భక్తుల నొక
టైనను గల పురుషులతివ లచర చరములున్
నాసురూపము కృపఁగాంచి యు
న్నార ప్రియులగుదు రెందునున్ నాకతివా. 401

తే. అన్ని విధముల దృఢభక్తి యమరియుంట
యోగులకు దుర్లభంబయి యొప్పు సుగతి
నీకు సులభంబు మద్భక్తి నిష్ఫలంబు
కాదు విడిపించుఁ ద్రివిధమౌ కర్మతతుల. 402

క. నాదర్శన ఫల మనుపమ
మాదివ్య సహజ సురూప మందఁగఁ జేయున్
మేదినిఁ గల జీవులకని
యాదీనదయాళుఁ డెఱుఁగుమని మరలననెన్. 403

చ. కరివరయాన యాజనక కన్యక ఘోరవనంబులోన నెం
దరిగెనొ జాడనీకు నెఱుకాయెనె తెల్పుము భామినీయనం
బరిపరి రామచంద్ర విభుపాదములందు శిరంబుసోకఁగా
నెఱఁగి సమస్త మీవెఱిఁగియే ననుఁదెల్పఁగఁ గోరెదేసప్రభూ 404

మ. అని వృత్తాంతము సర్వముం దెలిపి దేవా నీవుపంపాసరో
ఘనపుణ్యాంబు మహాకరంబునకు నేగంగల్గు సుగ్రీవుతో
డను సఖ్యంబతఁ డన్నియుం దెలుపుఁ గ్రీడామాత్ర దివ్యావతా
ర నినుం గన్గొనుకంటె గొప్ప సుఖసామ్రాజ్యంబు వేఱున్నదే.

చ. అని వచియించి రామవిభునానన పంకరుహంబుఁ గాంచుచున్
మనమునఁ దత్ప్రభూత్తముని మంజు పదాబ్జయుగంబు నిల్పుచుం
దన ఘనయోగజానల నితాంతకళాహుతి ముక్తదేహయై
పునరనివృత్త రామపదముంగనె నాశబరీవధూటియున్. 406

ఉ. ఓనరులార పెక్కులయి యొప్పు మతంబుల ధర్మకర్మముల్
మానిమనోవచః క్రియల మాయయు మానము వీడి జానకీ
జానిపదాం బుజంబులను సమ్మతి నమ్మకముంచి భక్తియే
పూనుఁ డటంచుఁ బల్కెను ప్రబుద్ధుఁడు శ్రీతులసీ కవీంద్రుఁడన్

ఆ. పాపజన్మమైన పడఁతికి గులహీన
మైన నిచ్చె మోక్షమతి దయాస
ముద్రుఁ డట్టి రామభద్రు మఱచి సుఖం
బభిలషింతె మందమైన మనమ. 408

క. అనియెం దులసీ కవివరుఁ
డనంతరము రామచంద్రుఁ డనుజుఁ డతిబలుల్
ఘనపురుష సింహములునాఁ
జని రా వనసీమఁ బాసి సాంద్రాటవులన్. 409

ఆ. అల్లు చనుచు రాముఁ డతి విరహార్తుఁ డౌ
జనునిఁ బోలెఁ గడు విషాదమొంది
బహుకథలను సల్లపనముఁ గావించుచు
నసఁ దొడంగె నిట్టు లనుజుతోడ. 410

తే. లక్ష్మణా కనుమీ వనలలిత శోభ
కలఁత గలుగును దీనినిఁ గన నెవరికి
ఖగమృగములు సమిధునతిఁ గానఁబడెడి
నన్నుఁ బరిహాస మొనరించు చున్న వనఁగ. 411

ఆ. మనలఁ జూచి లేళ్లమందలు పాఱంగ
నాఁడు లేదు లిట్టులనియె మీకు
భయము లేదు హరిణభవులాట సీతండు
కనకమృగము వెదుకఁ గడఁగెననుచు. 412

సీ. చక్కఁగా మననంబు సలిపిన శాస్త్రమై
నను మాటిమాటికిఁ గనఁగవలయు
సేవను చక్కఁగాఁ జేయుచుండిన దాన
రాజును వశుఁ డనరా దెప్పుడును
భార్యను వక్షంబుపై నుంచుకొన్నను
నమ్మరాదది మంచి నాతియనుచు
శాస్త్రంబు రాజును సతిని నెవ్వండైన
స్వవశులంచుఁ దలఁపవచ్చుఁ గీను.

ఆ. అనుచు నాకు బోధనాచరింపఁగ వచ్చె
వనఁగ వచ్చుచుండె హస్తిచూడు
హస్తినీసమేత యగుచు నీదెసకని
పలికె రామవిభుఁడు భ్రాంతతోడ 413

తే. చూడు లక్ష్మణ మిక్కిలి సొంపుగులుకు
నీవసంతము భయము జనింపఁ జేసె
జనకపుత్రిక యిపుడు నాసరసలేమి
నెల్లవారికిఁ దోఁచితి నెల్లిదముగ. 414

ఆ. ఒంటివాఁడ ననుచు నురు విరహార్తిచే
బలరహితుఁడ ననుచు భ్రమర ఖగయు
తంబుగాఁగ నదియె దండెత్తె మదనుండు
నలుదెసలను సైన్యనాదమెసఁగ. 415

తే. అనుజ సహితంబుగానున్న యతనిఁ జూచి
వచ్చితినటంచ నెడి దూత వచనము విని
మనసిజుఁడు గుడారము వైచికొని యిచటనె
యుండెననఁ దోఁచుచుండె నాకుల్లమందు. 416

చ. వివిధ లతావితాన పరివేష్టిత భూజములొప్ప వల్లరీ
నివహ కుడుంగముల్ మరునకీకినికిం బటగేహపంక్తినా
మివులఁగఁ దోఁచుచుండె నిటమింటికి నంటెడి తాళవృక్షముల్
నవకదళీ మహీజములు నాకు ధ్వజంబు లనంగనం బడున్. 417

ఆ. ఇట్టి వానిఁజూచి యెవ్వని చిత్తంబు
మోహితంబుగాదొ ముఖ్యముగను
నట్టివాఁడె ధీరుఁ డనవచ్చు లక్ష్మణా
మోహితుండు సుఖముఁ బొందఁ గలఁడె. 418

క. నానా విధ వృక్షములు ప్రి
సూన సమేతములు గాఁగ శోభిలుఁ గనుమా.
మానస భవ భటులు వివిధ
మైన సువేషములఁ దాల్చి యలరిరో యనఁగన్. 419

ఆ. అచట నచట నందమైన వృక్షంబులు
గానఁబడియె భటులొకం డొకఁడుగ
నిలిచిరన మదేభసిప్ఠుర ఘీంకృతి
కరణి వినఁబడియెఁ బిక స్వనంబు. 420

ఆ. బకబలాహాకములు భావింపఁగాఁ దోఁచె
నుష్ట్రఖరము లనఁగ నొప్పుగులుకు
కీరనికరమును జకోర మయూరముల్
మరుతురంగ కోటిమాడ్కి నమరె. 421

తే. హంసపారావతంబు లత్యంత సత్వ
యుత హయంబులునాఁ దోఁచుచుండె మఱియుఁ
దిత్తిరీ లావుకప్రితతియె పదాతి
దళ మలవిగాదు పలుక మదనునిసేన. 422

క. గిరిశిలలు స్యందనంబులు
ఝరుల రొదలు దుందుభిరవ సాదృశ్యంబుల్
మరుని గుణ స్తుతి చేసెడి
వరవందులు చాతకము లవరజాకంటే. 423

క. పృథుభేరీ తూర్యంబులు
మధుకర ఝంకృతులు త్రివిధమారుతమును న
మ్మథుఁడును సేనానులు మ
న్మథునకతఁడు సబలుఁడగుచు మనుజులనలచున్. 424

తే. లక్ష్మణా యిట్టి కామబలంబుఁ జూచి
యెవఁడు ధీరుం డగునో వాఁడ హీన గౌర
వంబుఁ గాంచు జగమున బలంబతనికి
నంగనయె దానినిర్జించు నతఁడె జెట్టి. 425

క. కామము క్రోధము లోభము
నీమూఁడును బ్రిబలములు మనీషులగు ముని
గ్రామణుల మదులనైనను
నేమముఁ దొలఁగించి కలఁచు నిముసములోనన్. 426

ఆ. శ్రేష్ఠులగు మునుల్ వచింతురు యోచించి
లోభమునకు నిచ్ఛ లోలతయును
దంభమును బలములు తరుణి కామమునకు
క్రోధమునకు వాక్పరుషత యనుచు. 427

ఆ. అని వచించె రాముఁ డనుజునితో నని
శివుఁడు వలికెఁ జంద్రశేఖరిఁ గని
వినుము శైలతనయ విశ్వంబునం జరా
చరములకుఁ బ్రభుఁడు శాశ్వతుండు. 428

క. త్రిగుణాతీతుఁడు రాముఁడు
జగదంతర్యామి కామిచందంబున దై
న్యగుణంబుం బ్రకటించుచు
సుగుణులు వైరాగ్య దృఢతశోభిలఁ దెలిపెన్. 429

క. రాముని దయచే మాయయుఁ
గామ క్రోధ భయ లోభగతు లడఁగు గుణ
స్తో మైంద్రజాల ముగ్ధుఁడో
కోమనుజుం డాన టానుకూలతఁ గనినన్. 430

తే. అగజ తెలిపెద వినుము నాయనుభవంబు
జానకీపతి భజనయే సత్యమగును
సకల జగములుఁ బరికింప స్వప్నములగు
ననుచు బోధించెనని ముని యనియెమునికి 431

## రామలక్ష్మణులు పంపాసరోవరమున కేగుట.

క. వినుమంతట శ్రీరాముఁడు
సనియెం బంపాఖ్యనిమ్న జలసంయుతమై
కనులకుఁ బండువౌనర్చెడు
వనజాకర తీరమున కవరజుని తోడన్. 432

ఆ. సుజను మనమువోలె శుద్ధ జలాన్వితం
బగుచు నాల్గుదెసల నమరియున్న
ఘట్టములు సెలంగఁ గానొప్పె నాసరో
వరము కరముఁ బ్రీతికరమచును. 433

తే. ఆ సరోవరరాజమం దన్నియెడల
సకల మృగములు హాయిగా జలముఁగ్రోలు
నత్యుదారుని గేహమం దర్థిబృంద
మన్న పానంబులం దృప్తి నందునట్లు. 434

క. మాయాచ్ఛన్నుండై తగు
నాయగుణ బ్రహ్మమట్టు లతివేగముగాఁ
దోయజ దళసంఛన్నం
బై యా సరసీసలిలము నగపడకుండెన్. 435

ఆ. అత్యగాధమైన యాసరోవరమున
ఝషచయంబు బ్రదుకు సౌఖ్యముగను
శివుని గొలుచు ధర్మశీలియగా మనుజుని
దినము లతి సుఖముగఁ జను విధమున. 436

వికసిత బహు వర్ణాంబుజ
నికరముపై మధురరుతము నెఱపుచు భృంగ
ప్రకరము విహరింపఁగ హం
సకుల సలిల కుక్కుటాళి చక్కఁగఁ గూసెన్. 437

ఆకఁహం సాదులరుత
మాకమలాప్తకుల విభుని నానందమయున్
శ్రీకరు సంస్తుతి చేసిన
యాకరణిం దోఁచుచుండె నాసమయమునన్. 438

బకచక్రవాకముఖ ఖగ
నికరాతి మనోహరత గణింపఁగ వశమే
వికచ స్వనమునఁ గూయుఁ బ
థికులన్ రండనుచుఁ జీరుతీరున మఱియున్. 439

ఆవనజాకరంబునకు నన్నిదెసల్ రమణీయ కానన
శ్రీవిలసిల్లు రమ్యమగు వృక్షనికాయముతోడఁ దత్సవి
పావనిఁ బావనంబులగు నాశ్రమముల్ మునిరాన్నివాస యో
గ్యావహముల్ చెలంగుఁ బనసామ్రకదంబ పలాశభాస్వమై 440

చంపక వకుళ తమాలము
లింపగు బిల్వామ్ల వరమహీరుహములు బల్
సొంపుగులుకు పాటలములు
గుంపులుగా వెలయుఁ గిసలకుసుమ యుతములై. 441

పల్లవిత కుసుమితములై పరఁగు వివిధ
వృక్షముల గానముల్ సేయు భృంగవితతి
సహజ శీతల గంధిల సరళమంద
గంధవాహుండు వీచుఁ జొక్కముగ సతము 442

క. పరభృత కుహూ స్వనంబులు
సరసములై మానిజనుల శ్రీపణపుటములం
గరముం జొఱ ధ్వానంబులు
బరిహృతములు గాఁగ జొచ్చెఁ బార్వతి వినుమా. 443

క. పరహితకరుఁడై పరఁగెడు
పురుషుఁడు సిరిఁబొంది వినయముం బొందుకియఁ
దరువులు ఫల భరితములై
ధరణిం దాకంగ నమ్రతం గనియుండెన్. 444

క. సుందర తత్కమలాకర
మందున్ స్నానంబుఁజేసి యనుజయుతుండై
బృందారక సేవ్యుఁడు రఘు
నందనుఁడు సుఖించియుండె నగముల నీడన్. 445

తే. అచ్చటికి సురలును మును లరుగుదెంచి
స్తవములంజేసి చని రాత్మ ధామములకుఁ
బరమముదమున నట నా కృపాళుఁడుండె
ననుజునకు రసయుత కథలను దెలుపుచు. 446

## నారదుఁడు రామలక్ష్మణుల సందర్శనమునకై వచ్చుట.

క. విరహ వ్యథితుండగు న
ప్పరమాత్ముని రామవిభు నభవు భగవంతుం
బరికించి నారదుఁడు తన
పరుసంబగు శాపమిపుడు ప్రభుఁడు గ్రహించెన్. 447

క. నానా క్లేశభరంబుం
బూనుచు సహియించెఁ బరమ పురుషుండనుచున్
మానసమున యోజించుచు
దీనావనుఁ గలిసికొన నిదియె తఱియనుచున్. 448

క. పాణితలంబున గొనబగు
వీణ విరాజిల్లఁ జనియె విబుధముని జగ
త్త్రాణుఁడు సుఖమున్న తరు
శ్రేణీవృత భాసుర సరసీ తటమునకున్. 449

తే. భక్తి పరవశుఁడై రామభద్రు చరిత
పాడుచున్ వీణమీటుచు బహువిధముల
వర్ణనము సేయుచున్ వచ్చి వనజహిత కు
లేశు చరణాంబుజములకు నెఱగుటయును. 450

క. పరిరంభణం బొనర్చుచుఁ
బరమాదర మొప్ప రామభద్రుం డా ని
ర్జరమానిన్ స్వాగత మడి
గిరహిం గూర్చుండఁ జేసెఁ గెలనం బ్రీతిన్. 451

ఆ. అంత లక్ష్మణుండు సాదరంబున మౌని
చరణ సరసిజముల స్వచ్ఛసలిల
పూరములను గడిగె ముని రామచంద్రుఁ బ్ర
సన్నుఁ గని కరాంబు జములుమోడ్చి. 452

తే. బహు విధంబుల వినుతించి పలికెనిట్లు
లవ్యయా పరమోదార యగమ సుగమ
సుందర వరప్రదాయక సూరివినుత
యఖిల మెఱుఁగుదు నీవంతరాత్మ వగుట. 453

క. ఐనను వరమర్థించెద
నేనొక్కటి దానినిమ్ము నీరజనయనా
నానలినాక్షుం డిట్లనె
మౌనీంద్రా నాస్వభావ మార్గ మెఱుఁగవే. 454

క. నే నెప్పుడైన నెయ్యది
యైనను భక్తులకు దాచునట్టిఁ డనే యో
మౌనివర నీకు నడుగఁగ
రానిది మఱి ప్రియపదార్థ రాజియుఁ గలదే. 455

ఆ. అస్మదీయ భక్తులైన వారలకు నే
నీయరాని లాభమెద్ది లేదు
కాన మఱచియైన నానమ్మకంబును
విడువఁబోకు మెపుడు నెడఁదయందు. 456

క. అనవుడు సంతోషంబున
మునివరుఁ డిట్లనియె రామమూర్తిం గని యో
వనజాక్ష సాహసంబున
నిను వేఁడుచునుంటి వరము నిఖిలాధిపతీ. 457

క. నీ నామంబు లసంఖ్యము
లైనను నందొకటి కొకటి యధికంబనుచుం
గానము సేయును వేదము
లోనాథా రామనామ ముజ్జ్వలమగుచున్. 458

తే. అన్నిఁటినిమించి యఘవిహంగాళిఁ గూల్ప
సాధనంబగుఁ గావుత సంతతంబు
రామనామంపు వెగ్గు పూర్ణశశియగు త
నీదు భక్తియనెడు శరన్నిశఁ జెలంగి. 459

తే. విమల భక్తహృదయ నభోవీథి నెపుడు
నన్య నామంబులను తారకాళితోడ
రామనామంబు సంపూర్ణ సోముఁడగుచు
వెలుఁగుచుండ వరంబును వేఁడికొంటి 460

క. అనినఁ దథాస్తనె నారద
మునితోడ దయాపయోధి ముద మొదవఁగ రా
ముని చరణాంభోజములకు
వినత శిరుండయ్యె నంత విబుధముని రతిన్. 461

ఆ. అతి ప్రసన్నుఁడైన యా రఘుప్రభుఁ గని
మరలఁ బలికె విబుధమౌని మృదుల
వచన రచనఁ దగ భవత్ప్రేరితంబగు
మాయవలన మోహినై యతీచ్ఛ 462

తే. కోరితిని పెండ్లియాడ నే కారణమున
దానిఁ గాకుండఁ జేసితి వానతిమ్మ
నంగ శ్రీరాముఁ డల్లన నవ్వి పలికె
వినుము తెలిపెద నీకు నవ్విధము నెల్ల. 463

తే. అన్య విశ్వాసముల మాని యనవరతము
నెవఁడు నన్ను భజించునో దృఢమనమున
నట్టివానికిఁ గావలి నగుచు నేను
తల్లి శిశువును బ్రోచు చందమునఁ గందు. 464

తే. బిడ్డ యెఱుఁగక వహ్నిఁ జేపెట్ట నేగఁ
బట్టి తప్పించుఁ దల్లియా పట్టి హాని
సర్పమున్ ముట్టనేగు వత్సంబుఁ గాంచి
పరువునం బోయిగోవు తప్పంగఁ జేయు. 465

ఆ. ప్రౌఢుఁడైన సుతునిపై మాతప్రీతిని
మాన దెపుడు వేఱుమాడ్కిఁ గాంచ
దట్లె నాకుఁ బ్రౌఢులౌసుతుల్ జ్ఞానులు
భక్తిఁ గొలుచువారు బాలసుతులు. 466

ఆ. నాబలంబువలన నాదాసులుండుదురు
స్వబలముననె యుందురి జ్ఞానులెల్ల
నుభయులకును శతురి లుగరికామక్రోధ
ములు మనమున దీనిఁ దెలిసికొనుచు. 467

క. పండితులు నన్నుఁ గొలుచుచు
నుండెద రెల్లపుడు జ్ఞానమొందిన పిదపన్
మొండగు భక్తిని విడువక
ఖండానంద స్వరూపుఁ గాంతురు నన్నున్. 468

క. కామము క్రోధము లోభే
ర్ష్యానుదములు ప్రబలమోహయుతు లన్నిటిలో
రామయె మాయారూపం
బై మిగులఁ గఠోరదుఃఖ మాపాదించున్ 469

క. విను మునివర వేదపురా
ణ నివహమున్ సాధులా జనంబులను నుడుల్
వనమగు మోహము దానికి
వనిత వసంతర్తువగుచు వన్నెనొసంగున్. 470

తే. జపతపోనియమాది విశాలవర జ
లాశయంబుల నింకించు నతివయనెడి
గ్రీష్మమంగన వర్షర్తురీతిఁ గామ
ముఖ్య భేకకులమునకు ముదమునొసఁగు. 471

తే. అనఘ దుర్వాసనావ్రాత మనెడి కుముద
తతుల నలరించు సతి శరదృతు వగుచును
సర్వధర్మంబులను జలజాత సమితి
నంత మొందించు సుదతి హేమంతమగుచు. 472

తే. శిశిరమగుచు వెలఁది చేయును మమతనాఁ
బరఁగు పావలకిల్ల విరివిగాఁగ
నిబిడమౌ తమస్వినీరూప పైదలి
పాపఘూక తతికిఁ బ్రియద మొసఁగ. 473

క. శీల స్మృతి బుద్ధి బలగుణ
జాలంబను రఘుసమితికి సతియె యగుఁజుమీ
గాలంబని చతురమతుల్
మేలెఱిఁగి వచింత్రు సంయమి ప్రకరమణీ. 474

క. అవగుణ మూలము కామిని
వివిధములగు పీడ లనుభవింపఁగఁ జేయుం
భవ దుఃఖములకు ఖని యని
తవిలి నివారించితి నినుఁ దద్వ్యసనపరుక్ 475

క. అనిన మనోహరమగు రా
ముని వాక్యము లాలకించి ముని హర్షమునం
దనువు పులకింప సలిలము
కనుఁ గవనిండఁగఁ బ్రభునిఁ గని యిట్లనియెన్. 476

ఆ. ఇంత ప్రీతి కృపయు నింతటి మమతయు
నే ప్రభునకుఁ గలుగు భృత్యులందు
నీకుఁదక్క వికచ నీరరుహేక్షణ
భక్తరక్షణ ప్రపన్న యనియె. 477

క. ఏనరులట్టి ప్రభూత్తము
మానంబును మదము భ్రమయు మానుచు భక్తిం
బూని భజింపరొ వారలు
జ్ఞానదరిద్రులు నిరర్థజనులు నభాగ్యుల్ 478

ఆ. మరల రాము సుగుణమణిఁ గని నారద
మునివరుండు జ్ఞాపమూల నాకు
సాధుజనుల విమల సల్లక్షణంబులు
తెలుపు మనఁగ దేవదేవుఁ డనియె. 479

క. ఏవర లక్షణములచే
నేవశుఁడ నగుదునో సాధునివహంబు నకుం
బావన తల్లక్షణముల
నో విబుధమునీంద్ర వినుము యుల్లంబలరన్. 480

సీ. జితషడ్వికారుండు నతుల సుఖాన్వితుం
డనఘుండ కించనుం డచలుండమలుఁ
డత్యంతవిజ్ఞాని సత్యసంధుఁడు శుచి
నిష్కామి మితభోగి నిత్యధీరుఁ
డవధాన చిత్తుండుఁ బ్రవిమల భక్తిమా
ర్గైక ప్రవీణుండు ధీకలితుఁడు
కవికోవిదుఁడు యోగి ఘనుఁడు నిరీహుండు
నిర్మదుండును మాని నిర్మముండు.

తే. సకల సద్గుణ నిలయుండు సారహీన
సంసృతి క్లేశరహితుండ సంశయుండు
నాపదాంబుజముల కంటె నైజదేహ
గేహ సంసక్తి లేని నిర్మోహితుండు. 481

తే. స్వగుణ వర్ణన మొనరింప మిగులఁ గొంకు
నన్యగుణకీర్తనంబున కలరుటయును
గలుగు వాఁడును సముఁడు శీతలుఁడు సర్వ
హితుఁడు సరళభావుఁడు నీతియుతమహితుఁడు. 482

తే. జపతపోవ్రత సంయమ శమదమములు
నియమమును గురు హరి మహీ నిర్జరపద
భక్తియును శ్రద్ధయును క్షమాపరతమైత్రి
దయయు మాయారహిత మత్పదరతిముదము. 483

క. వినయము వైరాగ్యంబును
ఘన విజ్ఞానము వివేకగరిమ యథార్థం
బును వేదపురాణంబులఁ
గనుటయు దంభమదమాన కాపథవిరతుల్. 484

క. నిరతము మదీయ లీలలఁ
బరమానందమున వినుచుఁ బఠియించుటయుం
బరహితమును నిర్హేతుక
పరతం గావించుచుంట బహు సుగుణతతుల్. 485

ఆ. కలిగియుండువాఁడు గణుతింపఁబడు సాధు
జనుఁ డటంచు సకల జగములందు
నట్టి సాధుజనుల యపరిమితంబులౌ
గుణము లెన్న శ్రుతులకుం దరంబె. 486

తే. కలిత సాధుగుణంబులఁ బలుకువెలఁది
పాపఱేఁడు నుతింపఁగా నోపరనుచు
రామచంద్రుండు దెలుప నారదుఁడు వ్రాంగి
భక్తిమైవ్రాలె రామాంఘ్రి పంకజముల. 487

ఉ. ఎంతటి దీనబాంధవుఁ డహీన కృపాళుఁడు రాముఁ డుర్విజా
కాంతుఁడు భక్త సద్గుణనికాయము నాత్మముఖంబునం గడున్
సంతసమొప్పఁ బల్కెను నసంగత నాశలమాని రాముపై
సంతతరక్తి సేయు నతి సాధుఁడెధన్యుఁ డటంచుఁ బ్రీతితోన్ 488

క. తులసీదాసు వచించెం
జలజాయత నేత్రు చరణ సరసిజములకుం
దలవంచి నారదుఁడు రతిఁ
బలుసారులు మ్రొక్కి చనియె బ్రహ్మపురికిన్. 489

ఉ. రావణ వైరియైన రఘురాముని పావనకీర్తి నెవ్వరిం
పావహిలంగ నిత్యమును బాడుదురో విని చొక్కుచుందురో
యా వరబుద్ధులే వ్రత జపాదులు యోగవిరాగ ముఖ్య దీ
క్షావళి లేకయే కనెద రవ్విభుభక్తి దృఢంబుగా భువిన్. 490

ఆ. తెలివ దేహమనెడు దీపకళికఁ గాంచి
భ్రమసి శలభమగుచుఁ బడకుమనమ
కామమదము లుడిగి రాము భజించుచు
సుజన సంగ మొంది సుఖముఁ గనుము. 491

శా. లీలామాత్రజగత్రయీరచన కేళీలోల మాయామహా
జాలాసంగ యనంగభంగ హృదయాబ్జాత స్ఫురత్కర్ణికా
రోలంబా సకలావలంబ సుఖచిద్రూపా నిరాలంబ వి
శ్వాలంకార రమావిహార ప్రకృతివ్యాపార దూరాత్మకా 492

క. జగదాత్మక జగదీశ్వర
జగదారాధ్యస్వరూప జగదాధారా
నిగమాంతసార పరప
న్నగతల్పా విగతజల్ప నతజనకల్పా. 493

పంచచామరము :- ధరాంబరా నిలానలాంబు
తత్వకల్పితాఖిలా
చరాచరాత్మక ప్రపంచ
జాలచేతనాత్మకా
శరీర మానసేంద్రియ ప్ర
చారదూర నిర్గుణా
విరాట్స్వరూప విశ్వదీప
వీత పాపబంధనా

గద్యము

ఇది శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మ కరుణారసాసాదిత కవిత్వవైభవ
కాశ్యపస గోత్రోద్భవ రామాంబా సన్యాసేశ్వరా గ్రతనూభవ,
అవ్యయానందానుభవ, సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయ ప్రణీతంబైన సకల కలికలుష విధ్వంసక
విమల విజ్ఞాన సంపాదక శ్రీమదాంధ్ర
తులసీ రామాయణంబు నందు
తృతీయ సోపానము.

ఓమ్ తత్సత్
శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

---

ఓమ్

# శ్రీమదాంధ్ర తులసీ రామాయణము

## చతుర్థ సోపానము

## ( కిష్కింధాకాండము )

---

ఉ. శ్రీకర కుందనీల సరసీరుహ సుందర గాత్రులస్త్ర వి
ద్యాకలిత ప్రభావులు బలాకరులున్ శ్రుతివర్ణితుల్ గవా
సీక ధరామర ప్రియులు నిస్తుల విజ్ఞులు సీతగోయు సు
శ్లోకులు రామలక్ష్మణులు సుందరభక్తినాసంగ మ్రొక్కెదన్. 1

మ. పరమబ్రహ్మ పయోధిసంభవము శోభావంతమున్ సంసృతి
జ్వరవైద్యంబు శివాననేందు గళిత స్వచ్ఛంబు సీతాప్రియం
కరజీవంబు కలిప్రగాఢ బహుళాఘధ్వంసకం బవ్యయం
బురు సౌఖ్యప్రద రామ నామసుధ ధన్యుండౌ సతంబానినన్. 2

ఉ. ముక్తికి నాలవాలమును భూరిమహాఘనివారకంబు న
వ్యక్త సుఖప్రదంబు గిరిజాభవ సంతత వాసదేశ సం
యుక్తము జ్ఞానరత్నఖని యోగిజనాశ్రయమైన కాశినా
సక్తిని సేవసేయరతి సల్పకపోవునె యెవ్వఁడేనియున్. 3

మ. సకలామర్త్య సమూహమార్తిఁబడ స్వేచ్ఛం గ్రమ్ము హాలాహలం
బాక జంబూఫలమట్లు మ్రింగిన విశాలోక్షధ్వజం బోలున
ట్టి కృపాళుండు గలండె మందమగునో డెందంబ నీవేల త
త్సుకరాభీష్టదు నాశ్రయింపవు లసత్సోమార్ధజూటున్ శివున్. 4

క. శ్రీలక్ష్మీరమణా ముని
జాలార్పిత చరణ సుగుణ సంఘాభరణా
బాలేందు ధరస్మరణా
లీలామాత్రాత్మకృత [illegible]లితపాప్రవరణా. 5

తే. అవధరింపుము యాజ్ఞవల్క్య మునిపలికె
నాభరద్వాజుతో వినుమది)సుతకు
శివుఁడు దెలిపిన శ్రీరాము పవిమలకథ
విన భవాంధ తమిస్రంబు విరిసిపోవు. 6

ఉ. అంతట రామచంద్రుఁడు కృపాంబుధి సానుజుఁడౌచు ఋశ్యమూ
కాంతిక భూమికేగుటయు నగ్గిరిపై నిజమంత్రివర్గ మ
త్యంతముఁ గొల్వనున్నది వనాధిపసూనుఁడు వారిఁ బద్మినీ
కాంత సహస్రతేజులను గాంచి కడున్ భయమందిచెచ్చెరన్. 7

క. హనుమంతుని గని యిట్లనెఁ
గనుమటు బలమునను రూప గరిమ నతుల భా
క్కనులైన పురుషు లిరువురు
చనుదెంచుచు నున్నవారు చయ్యన నీవున్. 8

క. వటురూపంబునజని త
త్పటుతర విక్రముల విధము భావమునందే
తటుకున గ్రహించి నాకున్
స్ఫుటమనునటు సన్న చేసి బోధింపు సఖా. 9

తే. వాలి పంపినవారైన వారి మనము
మలినమైయున్న వెంటనే యీ మ్నాధరంబు
విడిచి పరువెత్తి పోయెదవడిగ నేన
టంచు సుగ్రీవుఁడిచ్చిన యానతివిని. 10

## హనుమంతుఁడు రామలక్ష్మణుల సందర్శించుట.

క. ధరణీసుర వేషముతోఁ
గరువలి కొడుకేగి వారిఁగని వినయమునన్
శిరమున్ వంచి తగ నమ
స్కరణముఁ గావించి మెల్లఁగా నిట్లడిగెన్. 11

క. శ్యామల గౌర శరీరులు
శ్రీమీరాజెడిక్షత్రియ ప్రసిద్ధాకృతులై
యేమి కతంబున వనమున
స్వామీ తిరిగెదరు మృదుల చరణంబులతోన్. 12

చ. అతి సుకుమార సుందర తరాంగము లొప్ప వనంబునందు మా
రుత వితతాత పప్రబల రూక్షతలన్ సహియించి ద్రిమ్మరం
గత మదియేమి మువ్వురసఁగాఁ దగు మూర్తులలోన నిర్వురో
క్షితిఁ జరియించు నానరుఁడుఁ గేవలుడైన ముకుందుఁడౌదురో. 13

ఆ. కాని యెడల విశ్వకారణంబును భవ
తారణంబు భారవారణంబు
నైన తత్త్వమిటు నరావతారము గాఁనె
ననఁగ నొప్పుదురు మహాత్ములార. 14

మ. అనినం గోసలనాథుఁడౌ దశరథక్ష్మాధీశ్వరాపత్యమై
వనికిన్ వచ్చితిమేము తండ్రిపనుపన్ వామాక్షితోఁ గూడినా
యనుజుం డీతఁడు లక్ష్మణాహ్వయుఁడు విప్రా రామనాముండ నే
ననియెన్ మారుతితో రఘుప్రభుఁడు నెయ్యంబొప్పఁ దియ్యంబుగన్

తే. మఱియు నిట్లనె దనుజుండు మానినీ వ
తంసమును హరియింప నత్తన్వి వెదకి
కొనుచు వచ్చుచునుంటిమో క్షోణీసురవ
రేణ్య మాచరితము వివరించినాడ. 16

క. నీ వృత్తాంతముఁ దెలుపుము
నావుడుఁ బ్రభుఁ డనుచెఱఁగి నమ్రతఁబదరా
జీవములఁ బట్టె గరములఁ
బావనిమై పులకరింపఁ బలుకు వెడలమిన్. 17

ఆ. అట్లు నిలచె రాము ననుపమ సుందర
మూర్తిఁ గనుచు నఖిలమును మఱచుచు
మారుతాత్మజుండు మఱి తత్సుఖంబభి
వర్ణనంబు సేయ వశముగాదు. 18

క. అని పలికి గౌరిఁ గన్గొని
యనియెన్ మినువాక తాలుపా విధముననా
హనుమంతుఁ డుండి ధైర్యం
బును గని యొక కొంతవడికి ముదమేపారన్. 19

క. తన దేవుండని మనమునఁ
గని యానందాశ్రు లొలుకఁగా నవ్విభునిన్
వినుతించుచు నిట్లనె నే
ననుపము నినునెఱుఁగ కిట్టులడిగితి దేవా. 20

క. నీ మాయచేత మోహిత
మామతిఁ గలవాఁడ నగుట నడిగితి మిమ్మున్
స్వామీ తెలియక కేవల
మా మనుజుని రీతి నన్ను నడిగెద వేలా. 21

తే. మోహవశుఁడను నతి మందబుద్ధిని గడు
జ్ఞానహీనుఁడఁ గౌటిల్యమానసుఁ డను
దీనబాంధవ శ్రీరామ దేవదేవ
మఱచితిని నీవు నన్నును మఱచినావె 22

క. అవగుణయుతుఁ డనయిన నను
భవదీయాంఘ్రి యుగసేవఁ బరఁగుట మఱువన్
భువనేశ్వర నీకుచితమె
భువిజీవులు నీదుమాయ మోహులుగారే. 23

తే. ఆ యనిర్వచనీయమహా మాయదాటఁ
గలుగుదురు నీదు నిర్వ్యాజ కరుణఁగాదె
నిరుపమానంద మందిర నిష్కళంక
స్వప్రకాశ పరంధామ సార్వభౌమ. 24

తే. వినుము నీయాన దేవ భజనము నితర
మగు నుపాయంబు నెఱుఁగ నీ జగమునందు
స్వామి సేవకుఁడును నిజజనని శిశువు
నమ్మి నిశ్చింతఁ దత్పోషణముఁ గనుగతి. 25

క. నేనును నిన్నే నమ్మితిఁ
గానన్ నిశ్చింతనుంటిఁ గరుణామతి నె
ట్లైనను మదభీష్టాభర
మూనెడు వాఁడవును నీవె యోజగదీశా. 26

క. అని పలుకుచు వ్యాకులమున
హనుమంతుఁడు స్వస్వరూపమంది మనమునం
ఘనమగు భక్తి జనింపఁగ
మునివరదుని చరణకమలముల వ్రాలుటయున్. 27

తే. రాముఁ డాతని నెత్తి యురమున గ్రుచ్చి
కౌగిలించుచు హర్షాశ్రుకణచయమునఁ
దడిపి శీతలుఁజేసి సుధామధుర మృ
దూక్తులలరంగఁ బలికె వాయుసుతుతోడ 28

ఆ. వానరేంద్ర నీవు వనటనొందకుము ల
క్ష్మణుని కినుమడిగను మత్ప్రియుఁడవు
సకలజనులు నన్ను సమదర్శియం డ్రిన
న్యగతులైన వారి కట్టినేను. 29

క. అత్యంత ప్రియుఁడను వా
రత్యంత ప్రియులునాకు ననవరతంబుం
గత్యంతరంబు లేకయె
నిత్యము నను నమ్మియుండు నిపుణులు గానన్. 30

క. హనుమంత యతఁడనన్యుం
డనఁబడు నెవ్వనిమతిని చరాచర పతియే
తనకు భగవంతుఁడని యా
తనిదాసుఁడు దానటంచుఁ దలఁచునొ సతమున్. 31

క. అనినన్ శ్రీరామప్రభుఁ
డనుకూలుం డంచెఱింగి యానందమునం
దనమదిఁ జింతన్ మాని ప
వననందనుఁ డిట్టులనియె వనజాక్షునితోన్. 32

## శ్రీరామ సుగ్రీవుల సఖ్యము.

తే. కొండమీఁదను వానరేంద్రుండు గలఁడు
సేవకుఁడు నీకుపేరు సుగ్రీవుఁ డతని
దీనునిగ నెంచి యభయ ప్రదానమిచ్చి
మైత్రిఁ గావింపు మతనితో మ్రాత లేంద్ర. 33

ఆ. అట్లయైన నాతఁ డన్ని దిక్కులకును
మర్కటముల నంపి మాతనూజ
వెదకఁ జేయునంచు వీపుపై రాముల
క్ష్మణులనెక్కఁ జేసి గాడ్పుపట్టి. 34

క. చనుచుండె ఋశ్యమూకం
బున కంతట రామచంద్రుఁ బుష్ట మునీంద్రుం
గనుఁగొని సుగ్రీవుఁడు తన
జననంబతి ధన్యమనుచు సంతస మొదవన్. 35

తే. ఎదురుగా నేగి పదముల కెఱఁగి మిగుల
నాదరించెను శ్రీరాము ననుజసహితు
నైన విధినెంచి చింతించె నాత్మలోన
కారొ ప్రీతులు నాకు నీ వీరులనుచు 36

తే. అంత హనుమంతుఁ డుభయ వృత్తాంతములను
వివరముగఁ దెల్పి రామ రవిజుల నగ్ని
సాక్షిగా దృఢప్రీతితో సఖ్య మొందఁ
జేసె నిరువు రభిన్నులరా స్నేహితులుగ. 37

క. అంతట శ్రీరామునిస్థితి
నంతయు లక్ష్మణుఁడు దెలుప నర్కసుతుం డ
త్యంతముఁ గన్నీరొలుకఁగఁ
జింతించుచు నిట్టులనియె శ్రీరామునితోన్. 38

క. దేవా దొరకఁగలదు మిథి
లా విభుసుత వెనుక నీస్థలంబున మదమా
త్యావళితో నేనుండం
గావింటి తెరువున జనకకన్య యడలుచున్. 39

క. చనియెఁ బరాధీన యగుచుఁ
గనియుంటిని నేను మమ్ముఁ గనినంతనె యా
జననియు హా రామాయని
తన పటముం జాఱవిడిచెఁ దడయక రామా, 40

చ. అని వచియించి నంతవిని యంశుక మేదిటు తెమ్మనంగ న
య్యన సుతుఁడీయ నందికొని హృత్ఫలకంబున హత్తికొంచునా
దినకరవంశ వల్లభుఁడు దీనునిపోలికఁ జింతనొందె శ్రీ
తనగజ రామచంద్రవిభు తత్త్వము నీకిపుడర్థమయ్యెనే 41

క. అని శివుఁ డడిగిన శాంకరి
మనమున నానంద మొంది మాధవులీలల్
కననతి చిత్రంబులు మా
యను దాటినఁగాని తెలియనగునె యెవరికిన్. 42

క. నాథా తావక కృపచే
బోధయొకించుక జనించెఁ బురుషోత్తము స
ద్గాథన్ వినఁ దనియదుమది
శ్రీధరుఁ డామీఁద నేమి చేసెఁ దెలుపవే. 43

క. అనినం గాత్యాయనితో
ననియెన్ శీతాంశుమౌళి యమృతముకన్నన్
ఘన భోగ్యంబగు శ్రీరా
ముని కథ వినునట్టి భాగ్యమున కెనకలదే. 44

క. అని పలికి యంబ కిట్లని
మనసిజ హరుఁ డవలికథ క్రమంబుగ నెఱిఁగిం
చెను వినుమనుచు భరద్వా
జునితోడన్ యాజ్ఞవల్క్య సూరివరుఁడనెన్. 45

ఉ. రాముని వ్యాకులాత్ముఁ గపిరాజు గనుంగొని పల్కెనో రఘు
గ్రామణి చింతనొందక తిరంబుగ ధైర్యమునిల్పు ముల్లమం
దేమెయి సీతక్రమ్మర లభించునో యాగతినెల్ల భంగులన్
నేమిగులంగ సాయమును నీదగు సేవయొనర్తుఁ జుమ్మనన్. 46

క. కరుణాసింధుఁడు నురుబల
పరిమితి యునునైన రామభద్రుఁడు సఖునా
దర భరిత వాక్యముల విని
పరితోషమునొంది యిట్లు ప్రశ్న మొనర్చెన్. 47

## వాలి సుగ్రీవులకు విరోధము సంభవించిన కథ.

దినకరపుత్ర నీవిటుల దీనతతోడ నమాత్యయుక్తతన్
వనమున నున్నకారణ మవశ్యము నాకెఱింగింపుమన్న నా
వనరుహనేత్రుతో ననియె వాలియు నేను నవర్ణనీయమై
తనరెడి ప్రీతినుండుదుము తమ్ముఁడనే నతఁడన్న రాఘవా. 48

మయుని నందనుండు మాయావి యనువాఁడు
వచ్చి మాపురమున ద్వారసీమ
నిలచి యర్ధరాత్రి పిలచె నాజికి శత్రు
వారణోరుసింహు వాలినంత. 49

వాలియునిల్వ కుగ్రుఁడయి వానినెదిర్చిన వాఁడు భీతి వా
తూలజవమ్మునం బఱవఁదొడఁగె బాఱె మదగ్రజుండు నే
నాలము సేయఁగా జనెదు నన్నుసహాయముగాఁగ నేగి త
య్యాలరి రక్కసుండు నొకయద్రిగుహం జొఱఁబాఱె భోరునన్.

రాక్షసుఁడట్టులద్రి కుహరంబునఁ జొచ్చిన వాలినాదెసన్
శిక్షణమాచరించి విను వీనినిబట్టి వధించి వెంటనే
పక్షములోన వచ్చెదను భానుతనూభవ యట్లురానినా
డాక్షణమందె చచ్చితినటంచుఁ దలంపుమటంచుఁ బల్కుచున్. 51

చెచ్చెరఁ దన్మహా కుహరసీమఁ జొరంబడె నొక్కమాసమే
నచ్చట నుంటినంతట మహాస్రపు వెల్లువరాఁగ వాలియే
చచ్చెనటంచు నెంచి ననుజంపఁగవచ్చు విరోధియంచెదన్
హెచ్చిన భీతినొక్కశిల నేగుహకడ్డముగాఁగ బెట్టుచున్. 52

పురమునకున్ రయంబడరఁ బోయితి మంత్రులు రాజహీనతా
తరుచర రాజ్యలక్ష్మికి నితండ విభుండని బల్కినన్నధీ
శ్వరు నొనరించిరంతటను వాలియుఁ బరిమార్చి వచ్చి న
న్నరసి మహావిభేదమతి నత్యధికంబగు వైరమూనుచున్. 53

క. నాదగు సర్వస్వంబును
బైదలినింగొంచు నన్ను బహునిర్దయుఁడై
మోదిన భయమున నే నా
నాదిశలకుఁ బరువులిడితి నతజనవరదా. 54

ఆ. అఖిల భువనములకు నట్లునేఁ బరువెత్తి
శాపభయముచే నిచటకు వాలి
రాఁడటంచు నెంచి నాఁడాదిగానుంటి
దిగులుతోడనంచుఁ దెలుపుటయును. 55

క. నిజసేవకుఁడై తగు పం
కజమిత్రి తనూజు దుఃఖగతివిని నవవా
రిజనేత్రుఁడు రాముఁడు తన
భుజయుగ్మముసాచి పలికెఁ బూషాత్మజుతోన్. 56

క. ఆగ్రహమున నలఁచెడు భవ
దగ్రజు వాలిన్ వధింతు నమ్ముర్కట నో
సుగ్రీవ యజహరాది సు
రాగ్రణులన్ శరణువేఁడినప్పటి కుడుగన్. 57

మ. హితు దుఃఖంబునకుం గరంబును వ్యథాహీనాత్ముఁడైనట్టి దు
ర్మతి నీక్షించినఁ బాతకంబొదవు మిత్రక్లేశమావంతయున్
క్షితి భృత్తుల్యము గాఁగనందగును స్వక్లేశంబు భూభృత్సమ
స్థితినున్నన్ రవఁబోలె నెంచవలె నీతిజ్ఞుండు భూమండలిన్. 58

తే. సహజముగ నట్టిభావమే శఠులకుండ
దట్టివారలు మైత్రి చేయంగనేల
దుష్టమార్గ నిరోధియై యిష్టుఁడెపుడు
సత్పథంబున నడిపింపఁజనును సఖుని. 59

ఆ. ఇచ్చువేళయందుఁ బుచ్చుకొనెడుతఱి
శంక లేని హితుని సద్గుణములఁ
బ్రకటపఱచు చతని సకలావగుణముల
దాచునతఁడె సుమ్ము తగినసఖుఁడు 60

క. తన శక్తిఁ గొలఁది నుపకృతి
నొనరించుచు నాపదైన నుడుగక స్నేహం
బును నూఱంతలు వెంచుచుఁ
దన మిత్రహితంబుఁ గోరుఁదగు సఖుఁడనుచున్. 61

క. శ్రుతులు వివరించు నిటు స
ద్ధితు గుణముల నెదుట మృదుల హితవచనములున్
వ్యతిరేకంబుగఁ గుటిలత
నతనికి వెనుకాడువాఁడు నరయసఖుండే 62

ఆ. వ్యాళగమనమట్లు వక్రమై యెవ్వని
చిత్తముండు న య్యనుత్తముఁడగు
దుష్టమైత్రి విడువఁ దొరకొనుఁగడు శుభం
బన్న వినుమటంచు ననియె విభుఁడు. 63

ఆ. దుష్టసేవకుండు దుష్టయౌ భార్యయు
కృపణుఁడైన నృపుఁడుఁ గపటమిత్రుఁ
డనఁగ నొప్పు నల్వురత్యంత పీడాక
రులుగ నెఱుఁగుమో తరుచరవర్య. 64

## శ్రీరాముఁడు సప్తతాళములం దునిమి దుందుభి కళేబరంబుఁ దన్నుట.

తే. అస్మదీయ బలంబున కాత్మఁజింత
సేయకుము మిత్ర నేభవదీయకార్య
మన్నివిధముల నెఱవేర్తుననిన రామ
చంద్రుఁ గనుఁగొనివల్కె భాస్కరసుతుండు. 65

చ. విను రఘువీర వాలికడువీరుఁ డనూనబలుండు సంగరం
బున నతిధీరుఁడాతనిని బోరవధింప నసాధ్యమిం జగ
మ్మునఁగల యెట్టిశూరులకు మున్నొక దుందుభినామ రాక్షసుం
దునిమి తదీయదేహము నిదోకను కందుకలీలఁ దన్నెడున్. 66

ఆ. సప్తతాళములను సరగ నొక్కటఁదుగ్రించు
శక్తిఁ గలుగువాఁడు శక్రసూనుఁ
డనఁగ వానిరాముఁ డశ్రమంబునఁ దుగ్రించి
దనుజు నస్థిరాశిఁ దలఁగఁదన్నె. 67

ఉ. రాము నపారదోర్బల పరాక్రమముల్ గని భానునందనుం
డీ మహితుండు సర్వజగదీశ్వరుఁడంచుఁ దలంచి యారఘు
స్వామి పదాంబుజంబులను వ్రాలెను మాటికిమాటికిన్ మదిం
బ్రేమయు భక్తియున్ మిగులఁ బెంపువహింపఁగ నుబ్బివేడుకన్. 

తే. వాలినేకాదు సకలలోకాలిఁ గలుగు
దుష్టులం జంపఁగల సమర్థుండితం డ
టంచు నమ్మెచు నానంద మతిశయింప
జ్ఞాన ముత్పన్నమగుట నవ్వానరపతి. 69

తే. పలికెనో దేవ నీదు కృపావిశేష
మున నచంచలమయ్యె నామనము గాన
నింక పరివార సుఖసంపదేద్ధతలను
విడిచి సేవింతునిన్ను మద్విభుఁడవనుచు. 70

క. ఇవియెల్ల బాధకములగు
నివ్వులన్ నీభక్తికండు మేధాసధులా
భవదీయ చరణసేవా
ప్రవీణులగు సాధుజనులు రాఘవరామా. 71

తే. శతృమిత్రులు సుఖదుఃఖ సంచయంబు
జగమునంగల ద్వంద్వ విషయములెల్ల
మాయచేఁ గల్పితములౌట మదిఁదలంపఁ
గావు పరమార్థములు నీవొకఁడవె కాక. 72

చ. ఎవని ప్రసాదమూలమున నిప్పుడు ఘోరవిషాద నాశకం
బవు భవదీయ దర్శనము నందితినో కలనైన వేనితో
బవరముగల్గ మేలుకొని భావమునం బెదరొందువాఁడ నా
పవతుఁడు వాలి నాకిపుడు ప్రాణహితుండు ఖరాసురాంతకా. 73

చ. సకలము సంత్యజించి నిను సర్వశరణ్యు నహర్నిశల్ మహో
త్సుకత భజింపఁగాఁగలుగు శుద్ధవివేకము నాకొసంగవే
యకలుష సత్కృపాపరత నన్నుఁ గపీంద్రు విరక్తవాక్యముల్
వికచ ముఖారవిందుఁడయి వించుహసించి ధనుర్ధరుండనెన్. 74

తే. వినుము దిననాథపుత్ర నేననినదెల్ల
సత్యమగుఁగాని తప్పదే సమయమందు
ననియె భగవంతుఁడనుచు విహంగపతికి
ఘనుఁడుకాగ భుశుండి యిట్లనుచుఁ దెలిపె. 75

తే. నటుఁడు చతురతనెట్లు వానరచయంబు
నాట్యమాడించునట్లు జానకి హృదీశుఁ
డఖిల జీవులనాడించు ననుచు సకల
వేదములుఁ గొనియాడు నవ్విభుని మునిహిమ. 76

## తార రామసహాయమొందిన సుగ్రీవునితోఁ బోరవలదని వాలికుపదేశించుట

ఉ. అంతట రామచంద్రుఁడు గుణాభరణుండు వయస్యుఁడైన భా
స్వంత తనూజు వెంటఁగొని చాపమహాశుగ పాణియై పుర
ప్రాంత మహీస్థలిన్ నిలిచి యాజికి వాలిని బిల్వుమాయనం
జెంతను రాముఁడుంట ధృతిఁజెంది కపీంద్రుఁడు గర్జసేయఁగన్. 77

శా. ఆనాదంబును విన్నయంతఁ గడుఁగ్రోధావేశతన్ వాలివే
పోనుంకింపఁగఁ దార తత్పదయుగంబుంబట్టి బోధించె ని
ట్లోనాథా విను కోసలాధిపసుతుల్ యోధాగ్రగణ్యుల్ ద్యుతిన్
భానుల్ రాముఁడు లక్ష్మణుండనఁగ నొప్పన్ వచ్చి సుగ్రీవుతోన్,

తే. సఖ్యమొనరించిరట వారు జమునయినను
గెలువఁగల రాలమున నతిసులభముగను
గాన వారలసాయంబు గలిగియిపుడు
పిలచె సుగ్రీవుఁ డేగంగ వలదనంగ. 79

ఆ. భీరుభావమైన ప్రియురాల సమదర్శి
రామచంద్రుఁడైన రవిసుతునకు
హితముసేయు నన్ను హింసించెనేని స
నాథుఁడను నగుదును నాతియనుచు. 80

ఆ. దురభిమానియైన సురనాథసుతుఁడు సు
గ్రీవు నొక్కతృణము రీతినెంచి
యేగి యతనిఁదాక నిరువురుఁ దలపడి
రర్కసుతుని గ్రుద్ది యార్చెవాలి. 81

క. ఆగ్రుద్దు కులిశహతి నా
సుగ్రీవుని మేనఁదగుల సుడివడుచు వ్యథా
వ్యగ్రుండై వడి రఘువం
శాగ్రణి సరసకును బఱచి యనెనీరీతిన్. 82

తే. ఓకృపానిధి రామ మహోగ్రుఁడైన
వాలి సామాన్యుఁడే లయకాలుఁడంచు
విన్నవించితిఁగాదె నేవెఱపుగదురఁ
దాళఁజాలక వచ్చితి దయనుగావు. 83

క. అన నీవును భవదగ్రజుఁ
డును నాకారముల నొకవడువునం గన్ప
ట్టిన భ్రమసి యేయనైతిని
యని యాతని మేనునిమిరె హస్తాబ్జమునన్. 84

క. పరమాత్ముఁడైన రాముని
కరసంస్పర్శమున నతఁడు గతపీడుండై
వర వజ్రదేహుఁడగుచుం
గరమున్ వినుతించె రాము ఘనసుఖధామున్. 85

ఆ. పాదరజముసోకఁ బడఁతిమున్ క్లేశంబు
వాసి నిలచె నట్టి వాసుదేవు
హస్తపంకజాత మంటిన సుగ్రీవు
వ్యథ తొలంగుటేమి యబ్బురంబు. 86

ఆ. భ్రమకు హేతువైన పరమాత్మ రాముండు
భ్రమసెననుట మిగుల భ్రమయ కాదె
భక్త హృదయములను బరిశీలనముసేయఁ
గ్రీడసూపు నిట్లు శ్రీవిభుండు. 87

ఆ. పుష్పమాలయొకటి పూషాత్మజుని కంఠ
మందువైచి యతని కధిక బలము
నొసఁగి మరలఁబంప నుద్ధతి బహువిధం
బులఁ గపిద్వయంబుఁ బోరుసలుప. 88

## వాలివధ.

చ. తరువుల చాటునుండి గుణధాముఁడు రాముఁడు సూచుచుండియా
తరణిసుతుండు డెందమున ధైర్యముఁగోల్పడి యోడుకాలమం
దురు శరమున్ వడిందొడిగి యుల్లము గాడఁగ వాలినేసినన్
ధరఁబడి వాలి రాముఁగని తక్షణ మూర్చితలోపవిష్టుఁడై. 89

సీ. కోమలాంభోధర శ్యామల తనువర్ణు
యానీకృత సుపర్ణు నఖిలపూర్ణు
నరుణాంబురుహనేత్రు నఘబంధనలవిత్రు
నార్త సజ్జనమిత్రు నతిపవిత్రు
సుందరతర జటా జూటాంచిత కిరీటు
నతుల మాయానటు హతనిశాటు
సజ్యకోదండ నిశాతేషు సంధాను
వరయోగి మునిజన వనజభాను

తే. ననుపమాన ప్రభాధాము నర్కవంశ
కుముదినీ సోము ఖలజనకుల విరాము
సకల కలుష నివారక చారునాము
నఘు రామునిఁబొడఁగాంచి హరిసుతుండు. 90

తే. తనివితీఱక మఱిమఱి తవిలి కాంచి
లోకగురుఁడని తన మదిలోన నెంచి
తత్పదాబ్జ యుగమునఁ జిత్తంబుఁజేర్చి
యెడఁదఁ బ్రీతియుఁ బలుకుల బెడిదమొప్ప. 91

ఉ. రామునిఁగాంచి యిట్లనె ధరాస్థలి ధర్మము నిల్పఁబుట్టి న
న్నేమి దొసంగునెంచి వధియించితి వీక్రియ వ్యాధుఁడో యనం
దామరసాప్తనందనుఁడు తావకమిత్రుఁడ నేను వైరినే
స్వామి యటన్న వాలిఁగని సర్వశరణ్యుఁడు వల్కెనీగతిన్. 92

ఉ. తమ్ముని భార్య చెల్లెలు సుతప్రియ భామిని పెండ్లికానియా
కొమ్మలు నల్వురున్ సమలు కోరు నెవండటువంటి యింతులన్
సమ్మతిఁగూడ నట్టి శఠుఁజంపినఁ బాపము లేదుగాన నే
నమ్మునఁ గొట్టినాఁడ నిను నందొకఁడౌ నపరాధివౌటచేన్. 93

శా. ఓరీ దుష్టమదాంధ నీపిృియ వధూపూక్తుల్ వినంబోక ని
ష్కారంబైతగు స్వాభిమానమున నాపాృిపొందియున్నన్ మదిన్
వైరంబూని భవత్సహోదరుని గెల్వన్ వచ్చితే శంకలే
కా రోషాదిక దుర్గుణాన్వితు మహాహంకారునిం గూల్చితిన్. 94

చ. అనవుడు వాలిపల్కె విను మంబుజలోచన నీసమక్షమం
దనుచిత మత్ప్రిపీణత రవంతయు సాగకపోయె నెన్నఁగా
ఘనతర పాపినైనఁ దెగుకాలమునందిపుడీవె దిక్కునా
కని మదినమ్మినాఁడ గతివై నను బోృివుము జానకీపతీ. 95

మ. అని భాషించెదు వాలి కోమలవచో వ్యాపారముంగాంచి చ
య్యనఁ దన్మస్తకమాత్మ దక్షిణసుహస్తాబ్జంబుతో నంటి నీ
తనువున్ నిశ్చలముంబొనర్తు ననువొందంబాృిణముల్ నిల్పుకొ
మ్మనవనాతండనె విన్నవింతువినుమో యానందరాశీపృిభూ 96

చ. మునులును జన్మజన్మమున బూనికయత్నము లాచరించియె
వ్వని వరనామమంత్యమున వాక్కునఁబల్కఁగఁ జాలకుందురో
మినుసిగవేల్పు కాశినలమింగని యెవ్వనినామసద్బలం
బున నవినాశమై వెలయు మోక్షము జీవులకిచ్చుచుండునో 97

ఆ. అట్టి పృిభునినిన్ను నక్షులఁజూచుచు
నోరుతెరచి నీదు పేరనుచును
బాృిణములను విడుచు భాగ్యంబు వేఱొక
సమయమందు నాకు సంభవిలునె 98

సీ. వేదముల్ నిత్యమే విభునిమూర్తిని నేతి
నేతియంచు వచించి నిర్ణయించు
పాృిణచిత్తేంద్రియ పృితతినొంచుచు ధ్యాన
మున మునులెవ్వని మూర్తిఁగందు
రట్టినిధానమా నాదిదైవమవన్న మా
దక్షులయెదుటఁ బృిత్యక్షమయ్యె
నత్యభిమానివీఁ డనిమెంచి దేహంబు
నిలుపు కొమ్మంటివి నీరజాక్ష

తే. కల్పతరువును నజుకి యేకష్టఁడైన
శాల్మలిని రక్షసేయునే జలమువోసి
సకల మంగళ సద్గుణ నికరధామ
రక్షితాశేష మోక్షదిదృక్ష రామ. 99

సీ. కరుణారసంబొల్క వరమునొసంగుము
కర్మవశమున లోకంబునందు
నెట్టిరూపంబుతోనే యోనులన్ నేను
సంభవించిన భవచ్చరణ భక్తి
నొసఁగుము వీఁడెనాకుద్ధియా బల విన
యంబుల మత్పుత్రుఁ డంగదుండు
కల్యాణపద వీనికరమును జేపట్టి
భవదీయదాసుగాఁ బరమకరుణ.

తే. మీఱఁగఁ బరిగ్రహింపుము మేనువిడుచు
వాఁడ సంతోషముగ నని వాలివలికి
మదకరిగళస్థ నవపుష్పమాల జాఱ
నెఱుఁగ నట్లశ్రమంబునఁ దొఱఁగెఁదనువు. 100

ఆ. తనువు దొఱఁగువేళ తామరసాక్షుప
దారవింద భక్తి యతిశయించె
వాలి కందువలన వైకుంఠధామ ని
వాస సుఖమునొసఁగె వరదుఁడెలమి. 101

తే. అపుడు కిష్కింధలోఁగల యఖిలపురుషు
లతివలుంగూడ నచటికి నరుగుదెంచి
రందులోఁ దార యధిక శోకార్తయును స
సంస్కృతాంగియు వివృత కేశయును నగుచు. 102

తే. బహువిధంబుల విలపింపఁ బ్రభుడుగాంచి
మాయఁ దొలఁగించి జ్ఞానమమ్మగువ కొసఁగఁ
బలుకఁగాసాగె నప్పుడ ప్పెదలిఁ గని
పరివిమలంబగు బోధ యేర్పడఁగ నిట్లు 103

క. ధరణీవాయ్వగ్ని జలాం
బరములనం బరఁగు పాంచభౌతికమగుచుం
గరచరణా ద్యవయవయుత
శరీరమత్యధమ మిచట తప్పొబడియుండెన్. 104

తే. కాని యిందుండు జీవుఁడో కాంత నిత్యుఁ
డిందులో దేనికై యేడ్చె దీవనంగ
జ్ఞానముత్పన్నమగుడుఁ దత్సతియు రాము
చరణములఁ బట్టి భక్తినొసంగ వేఁడె. 105

తే. దారుపాంచాలికలను జిత్రింబుగాఁగ
నాటలాడించు నట్లుల నఖిలజీవ
కోటినాడించు రాముఁ డోకుధరతనయ
యనిపలికిచెప్పఁ దొడఁగె శీతాంశువాళి. 106

ఆ. అంత రామునాజ్ఞ నన్నకు సుగ్రీవుఁ
డుత్తరక్రియలను దాత్తభంగి
వేగనాచరించె విధ్యుక్తముగఁ బ్రిభుం
డనుజుఁగాంచి యిట్టులానతిచ్చె 107

## సుగ్రీవ పట్టాభిషేకము.

క. తరుచర రాజ్యంబునకీ
తరణిసుతున్ రాజుఁజేయఁ దమ్ముఁడ చనుమీ
పురమున కన నెల్లరుఁ ద
చ్చరణాంబుజములకు నెఱఁగి చనిరి ముదమునన్ 108

ఉ. అంతట లక్ష్మణుండు వసుధామరులం బురవాసులైన ధీ
మంతులఁబెద్దలం జనులమానినులం బిలిపించివేడ్క భా
స్వంతతనూజు రాజుగను వాలిసుతున్ యువరాజుఁగాఁగ న
త్యంత శుభంబునిండ జెలువారఁగఁజేసెను వైభవంబునన్. 109

తే. పార్వతీ విను శ్రీరామభద్రుఁ బోలు
హితకరుండైన గురుఁడును బితయుమాత
బంధుఁడును నీశ్వరుండును బ్రభుఁడులేఁడు
సురలు మౌనీంద్రులును మనుష్యులును మిగుల. 110

ఆ. స్వార్థమునకుఁ బ్రీతి నాచరింతురు గాని
స్వప్రయోజనంపు వాంఛ లేక
యాశ్రితులను బ్రోచు నాదిదేవుఁడు రాముఁ
డతని కితరజనుల యక్కఱేమి. 111

ఆ. వారిజాసనునకు వరయోగులకు నాకు
నఖిల నిర్జరులకు నతఁడె ప్రాపు
కాని యతనికెందుఁగలదె యాధారంబు
స్వాశ్రయుండు సాధికాధికుండు. 112

ఆ. జ్ఞానమునకునేది జ్ఞానంబునొసఁగు నా
జ్ఞానమునకు నతఁడె జ్ఞానమిచ్చు
తేజములకునెల్లఁ దేజంబులొనఁగూర్చు
తేజమునకు నతఁడె తేజమొసఁగు. 113

క. సుఖములకునెల్ల సుఖమే
సుఖమీయఁగలదొ యట్టి సుఖమునకుఁ గడున్
సుఖమొసఁగు సుఖకరుండా
సుఖరాశి నుతింపవశమె సుదతీనాకున్. 114

ఆ. వాలిభయముచే దివసములు రాత్రులు
గ్లానిఁబడుచుఁ దప్తగాయమొంద
నుల్ల ముడుకుచుండ నంత సుగ్రీవుని
రాజుఁజేసె కనుము రాముకరుణ. 115

ఆ. ఎఱిఁగి ఎఱిఁగి యట్టి యీశ్వరు నెవ్వరు
విడుతురట్టిజనులు విపదగాధ
సాగరమునఁ ద్రెళ్లి చచ్చుచుఁ బుట్టుచు
ముట్టలేరు తీరమును భవాని. 116

క. వినుమంతట సుగ్రీవుని
ఘననీలాంగుండు పిలిచి కడుబోధించెన్
మనమలర రాజనీతిం
దన హస్తయుగంబు మోడ్చి తరణిజుఁడు వినన్. 117

## రామలక్ష్మణులు ప్రవర్షణగిరి యందుండుట.

తే. అపుడు శ్రీరాముఁడిట్లనె నతనితోడ
నేను పురిఁజొరఁ బదునాలు గేండ్లవఱకు
ఘన నిదాఘంబుడిగి వర్ష కాలమిపుడు
వచ్చెఁ జనుదాకనుందుఁ బర్వతమునందు. 11

ఆ. అంగదుండు నీవు నగచర రాజ్యంబు
నేలుకొనుఁడు నీదు హృదయమునను
నస్మదీయ కార్యమందు స్మరణనిల్పు
మనఁగ మ్రొక్కిచనియె నతఁడు బురికి. 119

క. అంతఁ బ్రవర్షణ శిఖరి న
నంతుఁడు రాముఁడు వసించె సానుజుఁడై ధీ
మంతులగు విబుధులటమును
కొంతతడవు హరివసించుఁ గొండనటంచున్. 120

క. రమణీయంబుగ గిరిగుహ
నమరిచి యుంచిరి చరాచరాధిపుఁ డటనే
మమున వసించిన దాదిగ
సుమనోఫల భరితములుగ శోభిలెఁ దరువుల్. 121

తే. మంజు మధుపానలుబ్ధ భ్రమరనికరము
జుమ్ము జుమ్మని రొదసేయుచుండెఁ గంద
మూల ఫల చారుపత్రి సముదయ మధిక
ముగ రుచిరమై చెలంగె నయ్యాగమునందు.

తే. అనుపమంబగు నాసుందరాచలంబుఁ
గాంచి యనుజసమేతుఁడై కమలనాభుఁ
డలరె సుర సిద్ధ మునివరు లండజమ్ముగ
భ్రమర రూపంబులందాల్చి భజనసేయ

ఆ. అతని యునికివలన నత్యంత మంగళ
రూపమయ్యె వనసరోజనయన
యందు శుభ్రరుచిరమగు స్ఫటికోపలా
సీనులైరి తద్విశిష్టగుణులు.

తే. భక్తి వైరాగ్య విజ్ఞాన పద్ధతులను
బోధచేసెను బహువిధ పుణ్యకథల
ననుజునకుఁజెప్పె శ్రీరాముఁ డతికృపాబ్ధి
యంత వర్షాగమంబు నిట్లభినుతించె.

## వర్షఋతు వర్ణనము.

ఆ. అంబరమునఁ గ్రమ్మి యతిమనోహరముగా
గర్జ సేయుచుండెఁ గంధరములు
ఘన విరాగి భక్తుఁగని యుబ్బియాడెడు
పగిది నాట్యమాడు బర్హివితతి.

తే. ఉరు భయంకరముగ మెరుగుల్లులుచుండెఁ
బ్రియను బాసిన నామది బెదరుగదురఁ
జంచలలు నిల్చుమెఱసి నశించుచుండె
దుష్టుమదిఁ బ్రీతినిలువక తొలఁగునట్లు.

ఆ. విద్యఁబడసి బుధుఁడు వినయాన్వితుండగు
కరణి వారివాహ గణము ధరణి
దరియవచ్చి వారి ధారలఁగురిసెడిం
గనుము లక్ష్మణా సకౌతుకమున. 128

ఆ. దుష్టవచనములకు దుండుడు కొందక
సాధుజనుఁడు మిగుల సైచురీతి
వర్షబిందు వితతి వడిమీఁదఁబడిన స
హించుచుండె నీమహీధరంబు. 129

ఆ. చిన్నచిన్న నదులు చెలరేగి పొంగుచుఁ
బాఱఁజొచ్చె నల్ప భాగ్యమొంది
ఖలజనుండు మిగుల గర్వించి యభిమాన
పతత సంచరించు పగిదిఁగనుము. 130

ఆ. వసుధమీఁదఁ బడెడు బర్షాంబువుల మలి
నంబుగలిగె బహువిధంబులైన
తనువులొంది మాయ దట్టంబుగాఁ గప్ప
జీవు వికృతులెల్లఁ జెందినట్లు 131

తే. సజ్జనునియందు సద్గుణ సంఘమెల్ల
వచ్చి పరిపూర్ణమగురీతి వారి నాల్గు
దెసలనుండియు వాగులై వెసనువచ్చి
సరసులను నింపుచుండె లక్ష్మణ కనుమదె. 132

ఆ. హరిని జెంది జీవుఁ డచలుఁడౌ పోలిక
వాహినీ జలంబు వనధిఁ జేరి
స్థాయిఁజెందుకొఱకుఁ జనుచుండె వేవేగ
నదియె చూడు లక్ష్మణా ముదమున. 133

తే. అహహఁ బాషండవాదుల కమలమైన
పరమ సద్గ్రంధపథము గుప్తమగునట్లు
తృణముచేఁ గప్పఁబడిన క్షితిని పథంబు
గోచరింపక యుండె సద్గుణనిధాన. 134

తే. వటులు వేదముల్ సదివెడునటుల నాల్గు
దిశలనుండియు భేకముల్ విశదముగను
జేయురవములు రమ్యమై చిత్తమునకు
విందుసేయుచు వినవచ్చె వినుము వత్స. 135

క. సాధకు మనమునఁ గ్రమమున
బోధజనించెడు విధమున భూమీజ శిఖా
గ్రాధారమూని నవనవ
దీధితులం బల్లవాళి దీపించెనదే. 136

ఆ. అర్కముఖములైన యల్ప భూరుహములు
పర్ణరహితములయి పరమధర్మ
రాజ్యమందు దుష్టరాజ ప్రారంభంబు
లడఁగినట్లు తోఁచె ననుజ కనుము. 137

తే. ధర్మమును గ్రోధమడఁచు చందమున నెచటఁ
వెదకినను ధూళి తోఁపక విపులనడఁగె
సస్యసంపదచే మహి చాలనొప్పె
ధరణి నుపకారి యగువాని సిరివిధమున. 138

ఆ. డంభియైనవాని దరిఁ జెలికాండ్రెల్లఁ
జేరువిధమున నె నిశీథవేళ
గాఢతమము గ్రమ్మ ఖద్యోతబృందంబు
గానఁబడెడినదియె కనుము వత్స. 139

ఆ. కన స్వతంత్రియగుచుఁ గామిని భ్రష్టయౌ
నట్లు దోఁచుచుండె ననుజచూడు
మధిక వృష్టివలన నలరుల సౌగంధ్య
గుణము సెడఁగఁ బొలుపు కూడఁదఱిగి. 140

తే. మోహమదములు నభిమానమును ద్యజించు
పండితులమాడ్కిఁ గృషికులు పైరులందుఁ
గలుపుతీసెదరెచటఁ జక్రముఖ విహగ
తతులు గనరావు కలియందు ధర్మమట్లు. 141

తే. ఊషరావని వర్షించుచున్నఁ దృణము
పుట్టకుండెను హరిపదాంబుజమరంద
పాన వివశీకృతాత్ముఁడౌ భక్తునెడఁదఁ
గామ ముఖ దుర్గుణంబులు గలుగనట్లు. 142

ఆ. మంచిరాజు నాశ్రయించి జనంబులు
వృద్ధిఁ బొందినట్లు పృథివియందు
జంతు సంతతులును సంతోషమున నభి
వృద్ధిఁగాంచి మిగుల వెలయుచుండె. 143

తే. అన్ని యెడలను పథికులత్యంత విరతి
నుండి రెట్లన బోధ సముద్భవింప
నింద్రియానీక మెల్ల నట్టిట్టుఁ జనక
స్థిరత నలరారుచుండెడి కరణివత్స. 144

తే. అప్పుడప్పుడు ప్రబల జంఝూనిలంబు
వీవ నంభోధరంబులు వోవుచుండెఁ
గుత్సితుం డుద్భవించినఁ గులముయొక్క
సకల సద్ధర్మములు వోవసాగునట్లు 145

తే. అప్పుడే నిబిడాంభోధరాళి కప్పు
నప్పుడే క్రిమ్మరందోఁచు నర్కబింబ
మపని దుస్సంగ సత్సంగ యమళమందు
జ్ఞాన నాశప్రభవములు జరుగుకరణి. 146

## శరదృతు వర్ణనము.

చ. కనుమదె లక్ష్మణా ఘననికాయముపోయెను వర్షకాలముం
జని శరదాగమంబగు ప్రశస్త మనోహరకాలమందుఁ బూ
చిన నవకాశ సంకులముచే మహియొప్పెను వర్షకాలమెం
దెను గడువార్ధకంబనఁగఁ దెల్లనికేశమిషంబు నూనుచున్. 147

ఆ. కను మగస్త్యతార కలితమై యుదయించి
యింకఁ జేసెఁ ద్రోవ నెల్లజలము
తోష మొదవ లోభశోషకం బగురీతి
దండితాతిఘోర దనుజ యనుజ. 148

క. కొలఁకులు నదులున్ నిర్మల
సలిలోపేతంబులయ్యె సాధుహృదయముల్
తొలఁగిన మదమోహంబులఁ
జెలఁగు విధంబునను మిగులఁ జేతోహరతన్. 149

తే. అంతకంతకు జ్ఞానికి నంతరించు
మమత నా సరోవర నదీ విమలజలము
లింకఁ జొచ్చె శరత్కాలమెఱిఁగి ఖంజ
రీటముల్ నచ్చెఁ దెలివి సుకృతమాలీల. 150

ఆ. నీతినిపుణుఁడైన నృపుని కృత్యముభాతిఁ
బంక రేణురహిత వసుధయొసఁగె
ధనము సెల్ల మూర్ఖతతి చింతఁగనుపోల్కి
జలము లివురువార ఝషము లడలె. 151

ఆ. మేఘ హీనమగుచు మిన్ను నిర్మలమయి
యంద మొందియుండె నాశ లెల్ల
విడిచి భక్తజనులు విలసిల్లు చాడ్పున
లక్ష్మణా ప్రశస్త లలిత సుగుణ. 152

తే. అచ్చటచ్చట మద్భక్తి యరుదుగాఁగ
నొక్కరొకరికి నలవడుచుండునట్లు
లచ్చటచట శరత్కాలమైనఁ గురియు
చుండె వానలు వినయప్రియుక్త శీల. 153

చ. పురమునువీడి సంతసముఁబొందుచు నేగుచునుండ్రి మేదినీ
శ్వరుఁడును దాపసోత్తముఁడు వర్తకవర్యుఁడు భిక్షుకుండునాఁ
బరఁగెడు నల్వురుం బ్రబలభక్తి జనింప శ్రమంబుఁజెచ్చెరం
బరిహరణంబు సేసిన ప్రభాక్చతు రాశ్రమవాసులోయనన్ .154

ఉ. మచ్చరణాబ్జ సంశ్రయత మానవులెవ్వరు బాధనొంద న
ట్లిచ్చ సుఖింపఁగాఁదొడఁగె నెంతయులోతగునీట మీనముల్
మెచ్చొనరించెఁ దామరలు మిక్కిలిపూయ సరోవితానముల్
సచ్చిదఖండ నిర్గుణుఁడు సద్గుణమూర్తిగఁ దోఁచెనోయనన్ ; 155

ఉ. సుందర రావముల్ సలుపుచుండెను భృంగములున్ ఖగంబు లా
నందముగాఁగ శార్వరిమనంబుల మిక్కిలి చక్రవాకముల్
వందురుచుండె దుష్టుఁడగువాఁడు పరోన్నత సంపదాళికిం
గుందుచు నున్నరీతిఁ గనుఁగొంటివె లక్ష్మణ సద్విచక్షణా. 156

తే. శంకరద్రోహులకు నెందు సౌఖ్యమబ్బ
నట్లు తృష్ణశమింపక యధికముగను
చాతక సమూహములు రొదల్ సలుపుచుండె
వానఁగాంక్షించి మిక్కిలి నగప్రగదుర. 157

తే. శార్వరీవేళలన్ శరచ్చంద్రికాంతి
దినకరాతప తాపంబుఁ దీర్చుచుండె
ధన్యతముఁడగు సజ్జన దర్శనంబు
సకలపాతక శమనంబు సలుపునట్లు. 158

తే. విష్ణుసందర్శనంబొంది విడువలేక
కాంచుచుండెడు భక్త సంఘంబనంగఁ
గుముదబాంధవుఁ బ్రీతిఁ జకోరవితతి
తనివితీఱక చూచు చందంబుఁ గనుము. 159

తే. మశకదంశాళి యడఁగె హిమంబువలన
బ్రాహ్మణద్రోహ దుశ్శీలపరుల కులము
లమ్మహాకిల్బిష వ్యథ ననుభవించి
పుడమిఁ బొడగానఁబడకుండ నడఁగినట్లు. 160

ఆ. సద్గురుఁడులభింప సంశయభ్రమలెల్ల
సమసిపోయినట్లు జంతుకోటి
సంకులముగనుండి శరదాగమముఁగాంచి
వెడలి చనియె నాల్గుకడల కిపుడు. 161

## సుగ్రీవుఁడు తనకార్యమును మఱచెనని రాముఁడు కోపించుట.

చ. చనియెను వర్షకాలము ప్రశస్త శరత్సమయంబువచ్చె నెం
దును గనరాకపోయెను విధుప్రతిమానవరాస్య సీత పో
యిన తగుజాడ కానఁబడెనేని వెసన్ నిముసంబులోనఁ దె
త్తును లయకాలునైన ననిఁద్రుంచి లసద్గుణ మత్ప్రియాంగనన్.

ఉ. ఎక్కడనున్నఁదెత్తుఁ దరళేక్షణఁ బ్రాణముతోడ నున్నచోఁ
దక్కక పల్ ప్రయత్నములఁ దాలిమితో నొనరించి యక్కజం
బెక్కుడు రాజ్యవైభవము నింతిని సంపదఁబొంది మత్తుఁడై
మిక్కిలి విస్మృతింగనియె మేరకు నాయెడ నేడు లక్ష్మణా 163

శా. ఏ బాణంబున వాలిఁ ద్రుంచితినొ యాపేమూఢునింగూడ నే
నా బాణంబునఁ గూల్తుఁ జూడుమని సర్వాత్ముండు గౌరీమృగీ
శాబాక్షీ వినుమే మహాత్మకృప నాశంబొందు మోహాధికం
బా బోధానిధి స్వప్నమందయినఁ గ్రోధావేశముం బొందునే. 164

ఉ. ఇట్టి విచిత్రమౌ చరిత నెల్లపుడున్ హరిపాదభక్తులా
నట్టి వివేకులైన మునులాత్మ నెఱుంగఁగలారు మూఢులై
నట్టి జనుల్ నటించు జగదావనలీలల మోహితాత్ములై
పుట్టిన స్వల్పభావమునఁ బోల్తురు మానవుతోడ రామునిన్. 165

ఆ. కోతిఱేనిమీఁదఁ గ్రోధాత్ముఁడైన యి
లా సుతేశుఁ గాంచి లక్ష్మణుండు
చాప మెక్కుపెట్టి శరములఁ గరమునఁ
బట్టి లేవ నంతఁ బ్రభుఁడు పలికె. 166

ఆ. వత్స సఖుఁడు మనకు వానరాధిపుఁడు సు
గ్రీవుఁ డఁదువలనఁ గేవలంబు
భయము సూపియిటకు రయమునఁ గొనిరమ్ము
వేఱు సేతతగదు వెడలుమనియె. 167

## హనుమంతుఁడు సుగ్రీవాజ్ఞగా వానరులంబిలువ దూతలం బంపుట

చ. ప్లవగవిభుండు రాముపని భావమున న్మఱపొందెనంచు న
ప్పవన సుతుండు చింతిలుచు భానుతనూజునిఁ జేరి మ్రొక్కి గా
రవమున బోధచేసెఁ గపిరాజ ప్రభుండగు రాము కార్యముం
దవిలి యొనర్పకుండుట యధర్మమటంచుఁ జతుర్విధంబులన్. 168

చ. అదివిని భానుసూనుఁడు భయంబును బొంది హరించె జ్ఞానమున్
మదకరమైన యీ విషయమాధురి చెల్లరె వాయుపుత్ర నీ
విదియె మదాజ్ఞయంచిపుడె యెల్లవలీముఖయోధకోటికిం
జదురుల దూతలం బనుపు చయ్యన వెండియు నాయనుజ్ఞగన్. 169

శా. మాసార్థంబుఁ నెవ్వరేని సకలత్మాభృచ్చరానీకమున్
నానాన్నిధ్యముఁ జేరఁ దెల్పరటులన్ నాయాజ్ఞ నేతేర రా
దోసంబుం బొనరించినట్టి కపులం దుంతుఁ నుఁడీ యంచు నీ
వీ సందేశము కూడఁ బంపుమనఁగా నింపొంది సామీరియున్ 170

ఉ. మాతలఁ బిల్చి యాదరముతోఁ దగు మన్ననచేసి వారికిన్
నీతియుఁ బ్రీతియుం భయము నేమమతోఁ నెఱిఁగించి పంప వా
రాతని పాదపద్మముల కానతమస్తకులౌచుఁ బోవఁగా
నాతఁడె వచ్చె లక్ష్మణుఁడు నాపురికింగడుఁ గ్రోధమూర్తియై. 171

## లక్ష్మణుఁడు క్రోధముతోఁ గిష్కింధానగరమున కేతెంచుట

ఆ. అతని మోముఁ గాంచి యతిభీతినొందుచుఁ
బాఱఁజొచ్చిరెల్ల ప్లవగులపుడు
ధనువు నెక్కు పెట్టి దగ్ధంబు చేసెదఁ
బురము ననె రఘుప్రభుని యనుజుఁడు. 172

సీ. ఆమాట నాలించి యగచరుల్ కిచకిచ
నఱచుచుఁ బఱచుచు నతిభయమునఁ
దరువుల తుదలకుఁ ద్వరనెగఁ బ్రాకుచుఁ
గుధరాగ్రములను గ్రుక్కనను చనుచు
గుహాలలోఁ డాగుచుఁ గోలాహలము సేయుఁ
బురమునందిట్లిప్పుడురుతరముగఁ
గలకలంబగుటకుఁ గారణం బేమని
యంగదుండ చటికి నరుగుదెంచి

తే. చరణముల వ్రాలనాతరుచరవరునకు
నభయహస్తంబు నొసగె రామానుజుండు
నర్క పుత్రుండు సౌమిత్రి యలుకఁ బూనె
ననుచు విని చాల భీతిల్లి యాకలమున. 173

క. మారుతిఁగని యిట్లనియెం
దారయు నీవుఁజని రాముతమ్ముని వినయం
బారఁగ బోధించుచు నా
గారమునకుఁ దోడి తెండు కపికుల తిలకా. 174

క. అనవుడుఁ దారాయుతుఁడై
హనుమంతుఁడువోయి రామునను జన్ముని పా
వన పద వన జాతములకు
వినయంబున మ్రొక్కి రామవిభుని యశంబున్. 175

క. కొనియాడుచు నాతనిఁ దో
డ్కొని మందిరమునకువచ్చి గొబ్బునఁ దత్పా
వన సుందర మంజుల పద
వనజంబులఁ గడిగి భక్తి వైభవ మెసఁగన్. 176

తే. పాన్పుపైఁ గూరుచుండ నాభద్రగుణు నొ
నర్చి యర్చించి యధిక వినయ మెసంగ
సేవచేయుచునుండి రాశ్రితశరణ్యు
ననిలతనయుఁడుఁ దారయు నట్టితఱిని. 177

చ. త్వరితముగాఁగవచ్చి ప్రభుతమ్ముని పాదసరోజయుగ్మనుం
గరములఁబట్టి నర్కజుఁడు గారవ మొప్పఁగ వాని హస్తపం
కరుహయుగంబుసాచి తనకౌఁగిటఁ జేర్చెను లక్ష్మణుండు నా
దరమున నంతనిట్టులనెఁ దర్కపినాథుఁడు నమ్రభావుఁడై. 178

క. దేవా విషయ సమానం
బౌ విస్తృత మదకరంబిఁకన్యము గలదే
యీవిషయాసక్తత ముని
భావములుం క్షణములోనఁ బడు మోహమునన్. 179

క. అనిలన్ వినయోపేత వ
చనముల విని లక్ష్మణుండు సంతసమున నా
తనికిం బెక్కులు నీతులు
వినుమని యుపదేశ మొసఁగ వినెనతఁడు రతిన్.

ఆ. అంత ననిలపుత్రుఁ డగచరవ్రాతంబుఁ
బిలువ దూతచయము నలుదెసలకుఁ
బంపినట్టి విధముఁ బలికె సుగ్రీవుండు
నంగదాది కపిసహాయుఁడగుచు.

## సుగ్రీవుఁడు హనుమదంగదాది వానర
## లక్ష్మణునివెంట రామదర్శనమున కేగు

క. హనుమంతుఁ గూడి స్వామి
తిన్ని గొలుచుచుఁ జనియెఁ బ్రీతి శ్రీరాముని ద
ర్శన మాచరింప వేడుక
మనమునఁ బొడమం గతాభిమానుండగుచున్.

చ. చని రఘురామచంద్రు పదసారసయుగ్మము మౌళిఁ
దన మొనరించి పల్కె వితతంబగు నీదగు మాయ మో
డను భవదీయ సత్కృపకడంగి సురక్షితుఁగాఁగఁ జే
డినయెడ నేవిధంబున దృఢీకృత భక్తుఁడనౌదు మాధ

క. నిటల తట ఘటిత కరసం
పుటుఁడై విధ్వస్త సకల భూరివృజిన సం
పటలునితోడన్ మఱలఁ గ
పటహీనత ననియె నిలిచి భానుసుతుఁడిటుల్.

క. అపరాధ మేమిచేసితి
విపులంబగు నీదుమాయ విడిపించుకొనన్
నిపుణత నాకేది భవ
త్కృపయే సాధనము మోహహరముఁ జేరన్.

ఆ. నేను సకలకార్య నివహంబుఁ జేసెద
నేను చేయననుచు నిశ్చయింప
నేస్వతంత్రియుతుఁడనే భవత్కారుణచే
నేను మేను గామి యెఱుఁగకున్న. 186

క. దేహాభిమాని నగునే
మోహితమతి నైతినిపుడు ముఖ్యంబుగ నో
శ్రీహరి నిను శరణంటి మ
దాహంకారములఁబాపి యరయవె నన్నన్. 187

చ. మునులు సురల్ మనుష్యులును మోహితులౌదురు నీదుమాయచే
తను ననుబోటి కామియగు తామసజీవుఁడు వానరుఁడు భ్రాం
తినిగనఁడే మహాత్మ యువతీజన శాతకటాక్ష సంహతిన్
మనము చలింపకుండు నభిమానవిశం దెలివొందువానికిన్. 188

ఉ. ఎవ్వఁడు లోభపాశ పరివృత్తగళుండునుగాఁడో నీసముం
డవ్వరభాగ్యశాలి వినుమట్టి మహత్వము సాధనఁబుచే
నెవ్వరికిన్ లభింపదు మహేశ్వర శాశ్వత రామచంద్రనీ
మవ్వపు సద్దయామహిమమాత్రి లభించునుగాని భూనుతా. 189

చ. అనవుడు తమ్ముఁడా భరతునంతప్రియుండవు నీవటంచు నా
నవవనజాతముంది నును నవ్వెసఁగన్ రఘురామచంద్రుఁడి
ట్లనియెను సీతజాడ యెటులారయఁగాఁ బడునట్లుపాయ మీా
వానరుపుమన్న యంచనుచునుండఁగనే కపినాధ యూధముల్.

## నానా దిక్కుల నుండి వానర సైన్యము లేతెంచుట.

క. నానాదిక్కులనుండియు
నానా వర్ణములుగలిగి నానావిధ వా
గ్ధ్వానంబులు గావించు చ
నూనత్వర వచ్చె నబ్రిమొదవఁగఁ జేయన్. 191

క. వానరసేనం గంటిన్
నేనును శైలేంద్రతనయ నిరుపమమది యొం
దేని నెవఁడేని లెక్కిడఁ
గానెంచునొ దాని వాఁడుగడు మూర్ఖుఁడుమా. 192

క. అని శివుఁడు మరలబలికెన్
వినుమగజా రామచంద్రవిభు సంఘ్రియుగం
బున శిరములు సోకఁగ నా
వనచరులెల్లరును మ్రొక్కి వఱలెడుప్రీతిన్. 193

ఉ ఎంతటి భాగ్యవంతులమొ యెన్నఁడుఁ జూడనియట్టి యీప్రభా
వంతు వసంతరూప విభవంబున దిక్కులవెల్గఁజేయు న
త్యంత మనోహరుం గనఁగనయ్యెను మాకనియుబ్బి జానకీ
కాంతుని మోముదామరను గాంచువిలోకన మాచరించుచున్.

తే. నిలిచియుండిరి వారిలోపల నొకండు
రాము చేతను కుశల సంప్రశ్న సేయఁ
బడని వానరుఁడే లేఁడు పరమపురుషు
పట్ల నదియద్భుతమె రామభద్రవిభుఁడు. 195

తే విశ్వరూపుండును ననంత విశ్వజనన
పాలన లయంబు లొనరించు ప్రభుఁడు వ్యాప
కుండుఁ దన గర్భమందు బ్రహ్మాండ వితతిఁ
దాల్చిన ఘనుండును సమస్త దర్శకుండు. 196

ఉ. ఆంతిపొంత యెల్కకపు లచ్చట నచ్చట నిల్చియుండఁగా
భానుసుతుండు వారిఁగని పల్కెను వానరులార మీకు నా
కీశరనాథ శేఖరుఁడె యీశ్వరుఁడీతని కార్యమాని మీ
రఖిలావనిం దిశలనెల్లఁ జరింపఁగఁ గోరివేఁడెదన్. 197

చ. జనకతనూజ రాముసతి సాధ్వి నిశాటహృతన్ సమస్తభూ
వన కకుభంత దేశము లవార్యతఁద్రిమ్మరి రోసి జాడఁగ
న్గొని నెలలోన రానియెడఁ గూరిరతఁజంపుదుఁగాన మీరు గ్రి
క్కున జనుఁడన్నిదిక్కులకుఁ గూడను కాలునిదిక్కు దక్కఁగన్.

చ. అనవిని వారలెల్లరు రయంబున నయ్యెయిదిక్కులం జనన్
వనచరనాథుఁ డంతటను వాయుసుతున్ నళు నీలు జాంబవం
తుని నతిధైర్యవంతులను దోర్బలయుక్తుల బుద్ధిమంతులం
దనసుతు నంగదుంబిలిచి దక్షిణదిక్కున కేగఁబంపుచున్. 199

## హనుమదాది వానరులు సీతాన్వేషణమునకై దక్షిణదిశ కేగుట.

మ. పలుకన్ సాగెను మీరలెల్లరును శుంభద్దీక్షతో నెల్లచో
టుల నన్వేషణ చేయుచుం దగనిశాటుల్ సేయుతంత్రంబులన్
విలసచ్చాతురితో నెఱింగి ప్రభుదేవింగాంచిరం డాత్మలం
ఛలమొక్కింతయుఁగూడ దార్త జనరక్షాదక్షు కార్యంబునన్.

చ. నిరయసమాన సంసరణ నిర్భరశోక వినాశనార్థమై
పరమునుగూర్చి సేవ సలుపందగు మాయత్యజించి దేహముం
ధరణి ధరించినందులకుఁ దప్పక యైహిక సర్వకార్యముల్
పరిహరణంబుసేసి హరిభక్తి భజించుటయే ఫలంబగున్. 201

చ. సతతము రామచంద్రపద సారసయుగ్మము రక్తిఁగొల్చుచు
న్నతఁడె గుణజ్ఞుఁడుం ఘనుఁడు నాతఁడె భాగ్యసమేతుఁడంచు నా
దృతిఁదగు బోధసేయుటయుఁ దెల్వొఁదవఁ ఘుమ్రిలవార్లి వారలా
నతిఁగొని రామచంద్ర జననాథుని సంస్మరణంబు సేయుచున్.

చ. అరుగఁదొడఁగి రత్తఱిని నంగదుకిం బెరువెన్క భక్తితో
శిరమునువంచి మ్రొక్కిన ప్రసిద్ధగుణాఢ్యుని వాయుసూనునిన్
సరసకుఁజేరి భక్తుఁడని సర్వవిదుండగు రాముఁడిచ్చె నా
దరమున ముద్రికన్ శిరముఁ దామరసోపమ పాణినంటుచున్.

ఉ. వెండియు రాముఁడిట్టులని వేగమరమ్ము కుమార సీతతో
మెండగు నావియోగదశ మిక్కిలియౌ బలమున్ వచించి యు
ద్దండ పరాక్రమస్ఫురణ దానవనాథు దశాస్యుఁగూల్చి రా
ముండు నినుంగ్రహించు వగఁబొందకు మీవని బోధసేయుచున్.

చ. అనుటయు భక్తిమీఱ విభునంఘ్రులకుం బ్రణమిల్లి వేడుకం
దన జననంబు నేడు ఫలితంబయి మించెనటంచు నెంచుచున్
మనమున నిశ్చలంబుగ రమారమణీవరు రాము నిల్పుచుం
జనియెను మారుతాత్మజుఁడు సద్వినయంబున నాజ్ఞ వేఁడుచున్.

ఆ. సవితృవంశవిభుఁడు సర్వం బెఱింగియు
నమర కార్య నిర్వహణ మొనర్ప
రాజనీతిఁజరుప నీజగంబున నరు
లీల నటనసలిపె శైలతనయ. 206

ఆ. రామకార్యలీన మానసంబులతోడ
దేహములను మఱచి తీవ్రఁగ సాగి
రెల్ల వానరులు మహీధర కందర
వనసరిత్సరస్సులను వెదకుచు. 207

ఆ. ఎచటనైన నసురుఁ డెవఁ డెదురైన వా
రొక చపేటివాని యసువుఁగొనుచు
బహువిధంబులైన పర్వత కాననం
బులను వరసికొనుచుఁ బోవునపుడు. 208

ఆ. ఎచటనైన నీరునెన్నని గాంచిన
నెల్ల కపులు దతని నెలమిమీఱఁ
జుట్టుముండిరి నీరువట్టు బెట్టుగఁ బుట్ట
నెట్టిచోట నీటిపట్టులేమి. 209

క. ఒకసమయంబున వారలు
వికలత ఘనవనములందు వేసారుచు నో
పికతోడఁ దిరిగితిరిగి క
డకు జలమొదవక కడుంబడలువడి యుండన్. 210

క. హనుమంతుఁ డీవిధంబున
ననుమానము నొందసాగె నందఱికిపు డెం
దును జలము దొరకకుండినఁ
జనునో ప్రాణంబులనుచుఁ జాలగ మదిలోన్. 211

తే. అప్పు డతఁడొక గిరిశిఖరావరోహ
ణంబొనర్చి విలోకించె నాల్గుదెసలు
నతని కొకయెడ వింతగా నవని వివర
మొండు కనవచ్చె నందులో నొప్పుమిగుల. 212

తే. హంసలును బక చక్రవాకాది జలవి
హంగములు కొన్ని చొచ్చుచు నందునుండి
కొన్ని వెడలుచునుండుటఁ గూడఁగాంచి
యనిలజుఁడు పర్వతముదిగి యతిరయమున. 213

## హనుమదాది వానరులు భూవివరమున స్వయంప్రభను దర్శించుట.

తే. తోడివానరవీరులఁ దోడుకొనుచుఁ
జనియె నా భూవివరమున్న స్థానమునకు
ననిల సూనుండుమున్నుగా నావివరముఁ
జొఱఁబడిరి జాగుచేయక శూరులెల్ల. 214

వ. అటు వివరంబుసొచ్చి కని రద్భుతమహా సరసీరుహాకర స్ఫుట వనజాతగంధ పరిపూర్ణమకరంద రసానుమోద స న్నటదళిబృంద చారురవ నందకరోపవనంబు దానిచెం గట రమణీయమందిరము గాఢపుష్టియు నంగవాదులున్. 215

క. ఆమందిరమున నొకరమ
ణీమణి కూర్చుండియుండె నిస్తులతేజో
ధామయు తపఃపుంజము
నామహిత సురూపయై కనంబడు చచటన్. 216

ఉ. ఆమెకు దవ్వుదవ్వులనె యానతమస్తకులౌచు మ్రొక్కఁగా
నేమిటి కిట్లువచ్చితిరి యెవ్వరుమీరన నవ్వనాటులా
భామినికెల్లవృత్తమును బల్కిన నీరముఁగ్రోలుఁ డీవనిం
భూమిరుహాళిరమ్య ఫలభుక్తిని దృప్తివహింపుఁ డంచనన్. 217

ఉ. స్నానములాచరించి ఫలసంచయముం భుజియించి నీరముం
బానముసేసి యాతపసిపై దలిచెంతకుఁ దృప్తిఁజెందుచున్
వానరులెల్ల వచ్చినను వారలకున్ నిజవర్తనంబునా
మానిని తెల్పి రాముని రమాధవుఁజూడఁగ నేగెదన్ సుఁడీ. 218

ఉ. కావున మీరలెల్లరును గన్నులుమూసికొనంగ వెంటనే
భూవివరంబు నావలికిఁబోదురు కాంతురుతప్పకా జగ
త్పావన సీతనంచును దపస్విని చెప్పిన నట్లుచేసి యా
పావని ముఖ్యవృక్షచరపాళి పయోధితటంబుఁ జేరుచున్. 219

చ. ముదమునుబొంది యత్తపసిముద్దియ నెంతయు మెచ్చిరంతనా
సుదతియు రాముఁజేరి వరసుందర పంకజకల్పమైన త
త్పదయుగళంబునందు నిజఫాలముసోకఁగ మ్రొక్కి వేడ్క లోఁ
బొదలఁగ సంస్తుతించెఁ బరిపూర్ణ గుణార్ణవు నబ్దవర్ణునిన్. 220

మ. అనపాయంబగు భక్తినిచ్చెఁ బరిఫుల్లాబ్జాక్షుఁ డాభామినీ
జనతామండనమా తపస్వినికిఁ దత్సౌజన్యయున్ భక్తినె
వ్వనిపాదాబ్జము లబ్జజుం డభవుఁడున్ వందింతురా రామచం
ద్రునియాజ్ఞందలదాల్చి యేగె బదరీ స్తుత్యాటవీవాటికిన్. 221

# అంగదాదులు సుగ్రీవాజ్ఞచొప్పున గడువులోపల సీతంగానమికి చింతించుట.

ఉ. సాగరతీరమందు నలజాంబవదంగద నీలమారుతుల్
వేగమెచెల్లెఁగా యవధి వేసరినారము కార్యమేమియున్
సాగకపోయెనంచుఁ గడుసంతపియించుచు సీతజాడయే
లాగునఁదోఁచునంచు వికలత్వమునన్ వసియించియుండగన్. 222

ఉ. అంగదుఁడిట్లుపల్కెను నిజాత్మీయుగంబున వారినించి సీ
తంగనకుండనేగునెడఁ దప్పక చచ్చెద మెల్లవారమే
భంగిని జావునిశ్చయము భానుతనూజుని చేత నక్కటా
భంగమువచ్చె రామవిభుభామిని నారయఁజాలకుండుటన్ 223

తే. తండ్రిచచ్చిన యంతనతండు నన్నుఁ
జంపియేయుండు రామురక్షణమువలన
నుంటి నాయందుఁ గరుణలేకుండు నతని
కెట్టులైనవధించు నన్నిదిధ్రువంబు. 224

క. అనివారలతో మాటికి
ననుచుండఁగ వారికనుల నశ్రులుప్రవహిం
చెను క్షణమెల్లరు నేమియు
ననఁజాలక వ్యాకులంబు నందుచునంతన్. 225

ఉ. ఓయువరాజ సీతఁగనకుండఁగఁ గ్రమ్మరిపోవునూహలం
జేయమికెట్టులైన నిటసింధుతటంబుననుండి జానకిన్
రోయునుపాయముల్ మతులరోయుద మిందఱమంచు నుండి రా
తోయధితీరమందు వగతోడుత దర్భలపై వసించుచున్. 226

ఉ. ఉండఁగజాంబవంతుఁడనె నుల్లమునంగదుఁ గుందుచుంగదుం
డుండుటఁగాంచి వత్స విను మూర్ఛిఁజరించెదు మానవాళి నొ
క్కండనియెంచె దేమొ జనకప్రభువల్లుని రామచంద్రు నా
తండలనిర్గుణుండు పరతత్త్వము సర్వహృదంతరాత్ముఁడున్ 227

క. అనవుడు నాతనిదోడ్కొని
చనిరంబుధి తీరమునకు సంపాతియు న
వ్వాననిధి తీరంబునఁ దన
యనుజుని కుత్తరక్రియల నియతిమైఁ జేసెన్. 240

## సంపాతి తన వృత్తాంతమును వానరుల కెఱింగించుట.

తే. అంతసంపాతి యాత్మవృత్తాంతమెల్ల
నిట్లు వినుపింపఁదొడఁగెఁ గపీశ్వరులకు
నాజటాయువు నేను బాల్యంబునందు
నంబరంబున నెగిరితి మర్కుఁడాయ. 241

తే. సవిత్రు తేజంబు సహియింపఁ జాలకతఁడు
తిరుగదిగిపోయెనే మదాతిశయమునను
దురభిమానతఁ బద్మహితునికి మివుల
డగ్గరఁగ నేగ నెఱకలు భగ్నమనుచు. 242

ఆ. మండిపోయె ననుపమాన తత్తేజంబు
వలనఁ జీత్కరించు చిలనుబడితి
నట్టి నన్నుఁగాంచి యతిదయాన్వితుఁడయి
చంద్రిమాఖ్యనొప్పు సంయమిమణి. 243

తే. కీశవరులార జ్ఞానోపదేశమొసఁగి
తనువునందభిమానంబుఁ దలఁగఁజేసి
యనిమెఁ ద్రేతాయుగంబున హరిమనుష్యుఁ
డై యవతరించు నవ్విభునంగనయును. 244

సీ. అసురాపహృతయైన నయ్యూమ వెదకంగ
దూతలఁబంపు నన్నేత వారి
సందర్శనమువఁ బక్షుమ్ములు క్రిమ్మర
వచ్చును నీకింక వనటనొంద
కుమనిబోధించె నాసుమహితుండగు ముని
చంద్రుఁ డాతనినుడుల్ సత్యములగుఁ
గావుననేఁ దెల్పు కరణిని శ్రీరామ
కార్యంబుసేయుఁడు కడఁకమీర

ఆ. లోకపీంద్రులార యుదధిమధ్యమునఁ ద్రి
కూటమనఁగ నొప్పు కుధరమందు
లంకకలదు దాని శంకావిహీనుఁడై
యేలు రావణుం డహీనబలుఁడు 245

క. అచటి యశోకవనంబున
సుచరిత సీతావధూటి స్రుక్కుచుఁ జింతన్
విచలిత ధైర్యయగుచు నో
యచల చరవరేణ్యులార యగపడుచుండెన్. 246

ఆ. పారరహితమైన దూరదృష్టికరంబు
వఱలుచుండు మాదువంగడమున
కట్టుగాన నాకు నయ్యూమ కనఁబడు
చుండె మీకుఁ దోఁపకుండె వినుఁడు. 247

క. నేనతివృద్ధుఁడ నైతిని
గాన సహాయంబు మీకుఁ గావింపంగన్
లేనైతి బుద్ధిమంతుం
డైన యతఁడు దాటఁగలుగు నంభోరాశిన్. 248

క. అతఁడే సేయఁగలుగు శ్రీ
పతికార్యము దాటఁగలుగు బహుజవమున నీ
శతయోజనాంబు రాశిం
ధృతిఁబూనుఁడు నన్నుఁ గాంచి దేవోత్తముఁడా. 249

క. రామునికృపచే నిప్పుడు
నామేనెట్లయ్యెఁగనుఁడు నానావృజిన
స్తోమము సేసినతఁడుఁ ద
న్నామము స్మరియింప భవవసధిఁ దరియించున్ 250

తే. అట్టి శ్రీరామదూతలైనట్టి మీర
ధైర్యమున్ మాని రాముహృదయములందు
ధారణమొనర్చి యతిపునీతమతులగుచుఁ
దగు నుపాయంబుసేయ మీకగుశుభంబు. 251

తే. అనుచుఁ బక్షంబులుత్పన్నమైన కతనఁ
జనియెసంపాతి తగనిజస్థానమునకు
వినుము కాత్యాయినీ కడువిస్మయంబు
నొంది రా కపులెల్లను నుల్లములను. 252

## కపివీరులు సముద్రము దాటుటకుఁ దమతమ సామర్థ్యములఁ దెలిపికొనుట.

తే. అప్పుడెల్లరు వేర్వేఱయబ్ధిదాటఁ
దమతమ బలమ్ములంగూర్చి క్రమముగాఁగ
పలికికొనిరైన దాటఁగాఁగలమొ లేమొ
యనెడి సందేహముదయించె నందఱికిని. 253

ఆ. అంతజాంబవంతుఁ డనియె నేవృద్ధుండ
నైతి బలము సాల దంగమునను
తగఁ ద్రివిక్రమావతారంబు ఖరవైరి
దాల్చినపుడు మిగులఁ దరుణబలుఁడ. 254

క. బలిబంధన కాలంబున
జలజాతాండంబునిండి జలజాక్షుం డు
జ్జ్వల తేజమున విరాట్టై
విలసిల్లం బొగడవశమె వేనోళ్ళన్నన్. 255

తే. రెండుగడియలలోన బ్రహ్మాండమయుని
నేడు సారులువలగొనినాఁడ నిప్పు
డంతబలమును జవము నాకమరెనేని
నిముసమున సీతఁగననె మున్నీటిదాటి. 256

క. అననంగదుఁ డిట్లనె నే
వననిధి దాటంగలను జవమడరఁగా నై
ననుగ్రిమ్మర రాలేనని
యనుమానంబయ్యె నాహృదంతరమందున్. 257

ఆ. అనిన జాంబవంతుఁడనియె నీవరుగంగఁ
దగినవాఁడవైన నగచరేంద్ర
యెట్లు పంపువార మెల్లరకును నీవ
నాయకుండవగుట నయముగాదు. 258

క. అని హనుమంతుని గనుఁగొని
యనియెన్ నీబలమపారమనిలసుతుఁడ వీ
వనఘా సమీరునంతటి
ఘనజవముం బలమునీకుఁగలుగున్ మఱియున్. 259

క. విజ్ఞాననిధి వనల్ప
ప్రజ్ఞావంతుఁడవు నీతిపరతంత్రవిశే
షజ్ఞుఁడవు బుద్ధిమంతుఁడ
వజ్ఞునికి ప్రియ నేమి పలుకవది యేమిసఖా. 260

ఉ. నీవొనరింపలేనిదగు నిష్ఠురకార్యము ముజ్జగంబులం
బావనికల్గునే యవనిపై నుదయించితివీవు జానకీ
జీవిత నాథ పాదసరసీరుహ సేవయొనర్పఁ దత్ప్రియం
బై విలసిల్లు కార్యము సమాచరణం బొనరింపనింపుగన్. 261

## హనుమంతుఁడు సముద్రమును దాటనుద్యుక్తుఁడగుట.

చ. అనితనుగూర్చి జాంబవదుఁడాడెడు వల్కులవించు రామచం
ద్రుని పనిసేయఁబుట్టితివి తోయరుహాక్షుని పాదసేవ నీ
కనయముఁ బ్రీతియన్నపలుకంగము వొంగఁగఁజేయఁ బర్వతం
బన ఘనకాయుఁడయ్యెఁ బవనాత్మజుఁడాత్మ నిజాత్మఁగాంచుచున్

చ. అతనిశరీర మొప్పెఁ గనకాచలమోయన దిక్కులందునా
తతతపనీయకాంతి సముదాయమునిండఁగ సింహనాదము
ధ్ధతినొనరించి యిట్లనెనతండు శ్రమంబిసుమంత లేక యీ
వితతమహోదధింగడతు వీరతనెల్లజగంబులొననన్. 263

చ. పరిజనసంయుతుండనుజ భర్తను రావణునుక్కడంచి స
త్వరితగతిందిక్రూట వసుధాధరముం బెకలించి తెచ్చెదన్
వరసఖ జాంబవంతతగువాక్కుల నాకుప దేశమిమ్మనం
గరువలిపట్టిమెచ్చి యొసికంబుగ భల్లుకనాథుఁడిట్లనెన్. 264

ఆ. వత్స నీవుపోయి వలనొప్ప జానకిం
గాంచిరమ్ము వికచకమల నయనుఁ
డంత భుజబలమున నయ్యమఁ గొని తెచ్చుఁ
గౌతుకమునఁ గీశగణము గొలువ. 265

ఉ. వానరసైన్యయుక్తుఁడయి వారిరుహాక్షుఁడు రావణాది దు
ర్దానవులన్ వధించి లలితాత్రిజఁ దెచ్చుఁ ద్రిలోకపావనం
బై నతదీయకీర్తి నిఖిలామరకోటియు నారదాదులౌ
మౌనులు సంస్తుతించెదరు మానసముల్ వికసింపసొంపుగన్. 266

తే. అట్టిరాముని నిర్మలమైన యశము
వినుచుఁ బాడుచుఁ బలుకుచు మనమునందుఁ
దెలిసికొనుచును నెన్నండుఁ దిగిరిరాని
పరమపదమును మానవుల్ బడయఁగలరు. 267

ఆ. రామచంద్ర పాదరాజీవ మధుకర
మగుచుఁ దద్యశంబు ననవరతముఁ
బాడికొనుచు నధిక పరవశుండగుఁ దుల
సీసమాఖ్య భక్త శేఖరుండు. 268

క. భవరుగ్భేషజమై తగు
నవనీజా నాథుకీర్తి నతివలఁబురుషుల్
బ్రవిమలభక్తిన్ వినినన్
భువనేశ్వరుఁ డీప్సితార్థములఁ గృపనొసఁగున్. 269

తే. అమర నీలోత్పల శ్యామలాంగుఁ గోటి
కామ సన్నిభ సుందరాకారు వృజిన
ఖగసమూహా నిపాదసంకాశనాము
గుణగణశ్రవణంబె నాకు సుఖమొసఁగు. 270

చ. సరసిజ పత్రనేత్ర హర సారససంభవ ముఖ్యదేవతా
వరనుతిపాత్ర చారుతర వారిదగాత్ర రమాకళత్ర ని
ర్జరరిపుజైత్ర సాధుజనసంఘు మనోవనచైత్ర ఘోరసం
సరణలతా వితాన ఘన శాత లవిత్ర పవిత్ర రాఘవా. 271

క. సనకాది వినుతనామా
కనకమృగఖరాది కుధరగణ సుత్రామా
దినకర కులాబ్ధిసోమా
మునిజనహృద్ధామ కలుషపుంజవిరామా. 272

మాలిని :— నిగమవినుతశీలా నిత్యలోకేంద్రజాలా
అగుణసగుణరూపా యవ్యయజ్ఞానదీపా
విగతవృజినపాశా విజ్ఞహృద్ద్యోప్రకాశా
భుజగవరశయానా భోగివంశారియానా. 273

* గద్యః *

ఇది శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మ కరుణారసాసాదిత కవిత్వవైభవ
కాశ్యపస గోత్రోద్భవ రామాంబా సన్యాసేశ్వరా।గతనూభవ,
అవ్యయానందానుభవ, సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయప్రణీతంబైన సకల కలికలుష విధ్వంసక
విమల విజ్ఞాన సంపాదక శ్రీమదాంధ్ర
తులసీ రామాయణంబు నందు
చతుర్థ సోపానము.

ఓమ్ తత్సత్

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 5 | సుభగోద్యగ్రాత్రి | సుభగోద్యద్గాత్రి |
| 1 | 8 | గమనీయానవనిజాసుమిత్రిజస | గమనీయానవనిజానుజాన్వితుని |
| 4 | 1 | యోనిశా | హేనిశా |
| 4 | 8 | ప్రిభూ | ప్రిభో |
| 11 | 2 | యతి | యతివ |
| | 10 | జెదు | జెందు |
| 14 | 10 | ననఘుడు | ననఘుఁడు |
| 15 | 1 | ఎచ్చటి | ఎచటి |
| 20 | 13 | అప్పడు | అప్పుడు |
| | | దైర్యమూని | ధైర్యమూని |
| | 20 | జడుండన్ | జడుఁడన్ |
| 23 | 5 | హై | హే |
| | 16 | శీతాంశుఁడంవై | శీతాంశుఁడవై |
| | 22 | యస్త్ర్యశ్రిమము | యగస్త్ర్యశ్రిమము |
| 24 | 12 | శాశ్వతుండ | శాశ్వతుండు |
| 26 | 19 | బూని | బూనిక |
| 28 | 12 | భార్థనంబు | బార్థనంబు |
| 36 | 6 | దూళి | ధూళి |
| 38 | 11 | దిమతుని | ద్విమతుని |
| 40 | 3 | చచ్చితిమతి | చచ్చితిమని |
| 69 | 5 | రాఘురాముం | రఘురాముం |

ii

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 78 | 9 | సుదర | సుందర |
| 80 | 23 | సపూర్ణ | సంపూర్ణ |
| 89 | 18 | జాలార్పిత | జాలార్చిత |
| 90 | 11 | కనుత్రైన | క్తనుత్రైన |
| | 16 | స్ఫుటమనుటకు | స్ఫుటమగునటు |
| 96 | 20 | నేవ | సేవ |
| 105 | 14 | వాక్కునః | వాక్కున |
| 120 | 26 | పారము | తీరము |
| 121 | 15 | లభిపదు | లభింపదు |
| 122 | 23 | శేఖరుండె | శేఖరుఁడె |
| 123 | 7 | వతులను | వంతులను |

